


# అరుణతార

మావో ఆలోచనా విధానం వర్థిల్లాలి !

# విషయసూచిక



## రా. వి. శాస్త్రి సాహిత్య సమాలోచనలో

# అరుణతార

సాహిత్య - సాంస్కృతిక మాసపత్రిక 32-34

రచనలు పంపవలసిన అడ్రసు :

టి. మధుసూదనరావు

7, రాంనగర్

తిరుపతి

చందాలు, విరాళాలు పంపవలసిన అడ్రసు :

సి. యస్. ఆర్. ప్రసాద్

సి-108, శ్రీనివాసనగర్,

గుంటూరు 522 006

సంపాదకుడు : టి మధుసూదనరావు, 7, రాంనగర్, తిరుపతి

మేనేజరు : సి.యస్.ఆర్.ప్రసాద్, సి-108, శ్రీనివాసనగర్, గుంటూరు 522006

విప్లవ రచయితల సంఘం

# మావో ఆలోచనా విధానం:

# సాంస్కృతిక విప్లవం

1949 అక్టోబర్‌లో చైనాలో నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతం అయింది. జనచైనా అవతరించింది. దేశాలు స్వాతంత్ర్యం కోసం, జాతులు విముక్తికోసం, ప్రజలు విప్లవం కోసం పిడికిలి బిగించారు. ప్రపంచ చరిత్ర కదిలింది. సామ్రాజ్యవాదుల గుండెల్లో మరొక బాకు దిగింది. దోపిడీ వర్గాలు వణికిపోయాయి.

1956 లో జనచైనా సోషలిస్టు దశలోకి అధిరోహించింది. వర్గపోరాటం ద్వారా, నిరంతర విప్లవం ద్వారా సోషలిస్టు దశని సంరక్షించుకోవాలనే నూతన సిద్ధాంతం మార్క్సిస్టు కోశాగారంలో చేరింది. ప్రజలకి దూరమైన పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీలు కళ్ళు తెరిచి కలవరపడ్డాయి.

1966 లో చైనాలో సాంస్కృతిక విప్లవం. పార్టీలోని పెట్టుబడిదారి పంథాని పునరుద్ధరించటానికి ప్రయత్నంచేసిన కుట్ర ముఠా కూలిపోయింది. చీలికదారులు ప్రజాన్యాయస్థానాలలో నేరస్తులుగా నిలిచారు. రివిజనిజానికి సామ్రాజ్యవాద, సోషల్ సామ్రాజ్యవాదాలకి వ్యతిరేకంగా ప్రపంచ పీడితప్రజలు మేలుకున్నారు.

1976 సెప్టెంబర్ 9వ తేదీన పెకింగ్‌లో మావో మరణించాడు.

పొంగిపొరలుతున్న యాంగ్సీ నది మూగపోయింది.

.... .... ....

## "తుపాకి గొట్టంద్వారా రాజ్యాధికారం"

మార్క్సిజం-లెనినిజం పునాదిమీద చైనా కమ్యూనిస్టుపార్టీని మావో నిర్మించాడు.

మార్క్సిజం - లెనినిజాన్ని నిర్దిష్ట విప్లవ ఆచరణకి సృజనాత్మకంగా అన్వయించాడు.

పార్టీలోని అతివాద, మితవాద అవకాశవాదాలమీద నిరంతర పోరాటం చేశాడు.

నూతన ప్రజాస్వామిక విప్లవ పంథాని, కార్యక్రమాన్ని రూపకల్పన చేశాడు.

## "సరియైన రాజకీయ, సైద్ధాంతిక పంథా అన్నిటినీ నిర్ణయిస్తుంది"

మావో ప్రజావిముక్తి సైన్యాన్ని నిర్మించాడు. గ్రామీణ ప్రాంతాలలో స్థావరాలు నిర్మించుకొని పట్టణాల్ని చుట్టుముట్టి సాయుధ పోరాటం ద్వారా రాజకీయాధికారాన్ని సాధించడమే మార్గమని నిర్ణయించాడు. సామ్రాజ్యవాదాన్నీ, భూస్వామ్య వ్యవస్థనీ, దళారి బూర్జువా విధానాన్ని నిర్మూలించి, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేసి జనతా ప్రజాతంత్ర చైనాని స్థాపించటానికి మావో నాయకత్వం వహించాడు. చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అంతా మావో ఆలోచనా విధానానికీ, పార్టీలోని అతివాద, మితవాద అవకాశవాదులకీ మధ్య జరిగిన పోరాటాల చరిత్రే. నూతన ప్రజాస్వామిక విప్లవ విజయానికి మావో మూడు అద్భుత ఆయుధాల్ని రూపొందించాడు. మార్క్సిజం-లెనినిజం ప్రాపంచిక దృక్పథంగా గల కమ్యూనిస్టుపార్టీ, ఆ పార్టీ నాయకత్వాన ప్రజాసైన్యం, ఆ పార్టీ నాయకత్వాన విప్లవవర్గాల, బృందాల ఐక్యసంఘటనలే మూడు అద్భుత ఆయుధాలు. ఏ దశలో ఎలాంటి ఎత్తుగడల్నీ, వ్యూహాన్నీ రూపకల్పన చెయ్యాలో ఆచరణనుంచీ నిర్ణయించేవాడు. మిలటరీ నిర్మాణంలో మావో మహత్తర విప్లవకారుడు. సమయానికి తగిన నినాదాలు ఇస్తూ ప్రజాసందోహాన్ని సమీకరించి నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేశాడు. పార్టీకి, సైన్యానికి, ప్రజలకి మావో ప్రియతమ నాయకుడు.

## "వర్గపోరాటాన్ని ఎన్నడూ విస్మరించరాదు"

సామ్రాజ్యవాద యుగంలో ఒక దేశంలోని సోషలిస్టు దశలో కూడా వర్గపోరాటాన్ని కొనసాగించాలని మావో సిద్ధాంతం. నిరంతర విప్లవం ప్రజలు

సాధించిన విజయాల్ని కాపాడుకోవటానికి అనివార్యం. నూతన ప్రజాస్వామిక దశనుంచీ ఆవిర్భవించే సోషలిస్టు దశలో బూర్జువావర్గానికీ కార్మికవర్గానికీ ప్రధాన వైరుధ్యం ఉంటుంది. కాబట్టే సోషలిస్టు వ్యవస్థలో కూడా వర్గపోరాటాన్ని విస్మరించ్యం చెయ్యరాదు. సోషలిస్టు దశలో బూర్జువావర్గం ఎక్కడ వుంటుంది? కమ్యూనిస్టు పార్టీలోనే మితవాదులరూపంలో బూర్జువాలు ఉంటారు పార్టీలో అధికారస్థానాలలో ఉండి పెట్టుబడిదారీమార్గాన్ని పునరుద్ధరించటానికి ప్రయత్నించే ముఠాగా బూర్జువాలు ఉంటారు. అందుకే సోషలిస్టు దశలో కూడా వర్గపోరాటాన్ని కొనసాగించాలని మావో చెప్పాడు.

## "విప్లవరూపం, విప్లవ ప్రతీఘాతుక సారాంశం"

మనాడిమీద ప్రజలకి అధికారం వచ్చినా ఉపరితల అంశాలనుంచీ పెట్టుబడి దారుల తొత్తులూ, విప్లవ విద్రోహులూ, చీలికదారులూ కుట్రదారులూ పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించటానికి ప్రయత్నం చేస్తారు. వీళ్ళు రూపంలో విప్లవకారులుగా నటిస్తూ సారాంశంలో విప్లవ ప్రతీఘాతకులుగా ఉంటారు వీళ్ళనే రివిజనిస్టులనికూడా అంటారు. రివిజనిస్టుల్ని, సామ్రాజ్యవాద, సోషల్ సామ్రాజ్యవాద కుట్రల్ని బహిర్గతం చెయ్యటానికి మావో సాంస్కృతిక విప్లవాన్ని ఆయుధంగా ప్రయోగించాడు. కన్‌ఫ్యూసియస్‌ని వల్లిస్తూ ప్రజల్ని తప్పుదోవ పట్టించటానికి ప్రయత్నించిన లిన్‌పియావోని ఎండగటాకు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, రివిజనిస్టు ధోరణులకి వ్యతిరేకంగా చైతన్యవంతం చెయ్యటానికీ, ప్రపంచ పీడిత ప్రజల్ని దోపిడీవర్గానికి వ్యతిరేకంగా విప్లవ పోరాటాల్లోకి గర్జింపచెయ్యటానికి సాంస్కృతిక విప్లవం మహత్తరంగా దోహదం చేసింది.

## రచయితలు, సాంస్కృతిక సైనికులు

నూతన ప్రజాస్వామిక విప్లవంలో రచయితలు సాంస్కృతిక రంగంలో సైనికులు కార్మిక, రైతాంగవర్గ రచయితలు మార్క్సిజం లెనినిజం ప్రాపంచిక దృక్పథంతో ప్రజల విప్లవ పోరాటాల్ని ప్రతిబింబించాలి. విప్లవ రచయితలు

నూతన ప్రజాస్వామిక సాంస్కృతిక విప్లవ ఐక్య సంఘటనలోకి వచ్చే సామ్రాజ్యవాద భూస్వామ్య, సోషల్ సామ్రాజ్యవాద వ్యతిరేక రచయితలకి నాయకత్వం వహించగల శక్తిని ఆచరణ ద్వారా, ప్రజల్లో మమేకం కావడం ద్వారా సముపార్జించుకోవాలి. విప్లవ రచయితలకి స్థిరమైన వర్గపోరాట దృక్పథం ఉండాలి. సాహిత్య ప్రక్రియల్ని విప్లవ పోరాటాల్ని చిత్రించే వాహికలుగా మార్చాలి. 'ప్రజలనుంచీ ప్రజల దగ్గరికి' అనే ప్రజాపంథాని వస్తుశిల్పాల్లో ఇమేజరీస్‌లో, భాషలో సాధించాలి. సాహిత్య విమర్శలో ముందు రాజకీయ ప్రమాణాలకి తర్వాత సాహిత్య ప్రమాణాలకి విలువ ఇవ్వాలి.

మావో వర్తమానయుగంలో మహోన్నత మార్క్సిస్టు - లెనినిస్టు మేధావి. మార్క్సిజం - లెనినిజాన్ని నిర్దిష్ట విప్లవాచరణకి అన్వయించడంలో ప్రపంచ ప్రజలకు మార్గదర్శి. రివిజనిస్టు దుర్గాన్ని బద్దలుకొట్టి ప్రపంచ ప్రజల్ని విప్లవ అగ్నివీచికలోకి తెచ్చిన ఉత్తేజకారుడు. దోపిడీవర్గాల మీద అంతిమ పోరాటానికి ప్రపంచ శ్రామికుల్ని సంసిద్ధం చేసిన మహోపాధ్యాయుడు.

"రివిజనిజాన్ని కాదు, మార్క్సిజాన్ని ఆచరించండి. చీలికలు వాలికలు కాదు ఐక్యం కండి. కుట్రలూ కుహకాలూ చెయ్యకండి. నిష్కపటంగా ఉండండి."

చైనా అక్టోబర్ విప్లవ సాంప్రదాయం వర్ధిల్లాలి.

మావో ఆలోచనా విధానం వర్ధిల్లాలి.

మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం వర్ధిల్లాలి.

---

# కార్యదర్శి నివేదిక

కామ్రేడ్స్,

వీరోచిత పోరాట సంప్రదాయంగల మాచర్లలో కన్నెకంటి హనుమంతు శత జయంతి సందర్భంలో మనం మనరాష్ట్ర 9వమహాసభని జరుపుకుంటున్నాం. 1981 అక్టోబర్ 9, 10, 11 తేదీల్లో గుడివాడలో విరసం సాహిత్య పాఠశాలని జరుపుకున్నాం. 500 మందికి పైగా ప్రతినిధులూ, సభ్యులూ హాజరయ్యారు. భారతీయ సాహిత్యం_ వర్గపునాది, భారతీయ తత్త్వశాస్త్రంలో భౌతికవాద చరిత్ర, నాస్తికవాదం. హేతువాదం- వర్గ స్వభావం, నూతన ప్రజాస్వామిక విప్లవంలో సాహిత్యం పాత్ర వంటి అంశాలమీద పాఠాలు చెప్పడం జరిగింది. కొన్ని విషయాల మీద ఆసక్తికరమైన చర్చలుకూడా జరిగాయి. పాఠాలు అన్నీ అయిన తర్వాత శ్రోతలు అనేక ప్రశ్నలు వేశారు. ఆ ప్రశ్నలన్నిటికీ విరసం సభ్యులు సమాధానం చెప్పారు. విరసం ప్రచురించిన తుడుం, లూషన్ సాహిత్య జీవితం, మావోఏనాన్ ప్రసంగాలు, త్రిపురనేని మధుసూదనరావు తిరుపతి కుట్రకేసుసందర్భంలో చిత్తూరు సెషన్స్‌కోర్టులో ఇచ్చిన ప్రకటన 'సాహిత్యం కుట్రకాదు, రచయితలు కుట్రదారులు కారు' అనే పుస్తకాన్ని ఆవిష్కరించటం జరిగింది విరసం కార్యవర్గ సభ్యుడు ఎన్. కె నక్సల్‌బరీ దశాబ్దంలోని విశిష్ట పోరాటాల్ని కవిత్వరూపకల్పన చేసిన 'రిహార్సల్', వర్గీస్ వ్యాసాలూ, రాంమోహనరాజు 'రోడ్డుమీద సూర్యుడు', ప్రజాకవి గద్దర్ పాటల్నికూడా ఈ సందర్భంలోనే ఆవిష్కరించడం జరిగింది. పాఠశాల గుడివాడలోని సాహిత్యాభిమానుల మీద మాత్రమే కాక ఇతర ప్రాంతాల మీదకూడా గణనీయమైన ప్రభావం వేసింది. ఈ పాఠశాలలో చెప్పిన పాఠాల్ని ఒక పుస్తకంగా ప్రచురించాలనే సంకల్పం నెరవేరలేదు. పాఠం చెప్పినవాళ్ళు వ్యాసాల్ని ఇంతవరకు ఇవ్వకపోవడమే దీనికి కారణం. విరసం దశాబ్ది ఉత్సవాల తర్వాత పాఠశాల ఉత్తేజకరమైన కార్యక్రమంగా చెప్పుకోవచ్చును.

విరసం పాఠశాల తర్వాత ఎనిమిది నెలలకాలంలో నమ్మ 'గోదావరి లోయ' అనే ఉత్తమ విప్లవకవితా సంకలనం వచ్చింది టంకసాల అశోక్ కొడవటిగంటి కుటుంబరావు సాహిత్యం మీద అనేకమంది విమర్శకుల వ్యాసాల్ని సేకరించి 'భావ విప్లవ కారుడు కొడవటిగంటి సాహిత్య సమాలోచన' అనే గ్రంథానికిసంపాదకత్వం వహించాడు పీపుల్స్ బుక్‌వాళ్ళు ప్రచురించిన 'చెరబండరాజు కవితలు,

పాటలు' ప్రచురణకి వరవరరావు సంపాదకత్వం వహించారు. నవల,కథానిక ప్రక్రియల్లో విరసం సభ్యులు విజయాల్ని సాధించారు అల్లం రాజయ్య 'ఊరు' నవల, 'భూమి' కథల్ని ప్రచురించారు. 'అగ్నికణం' నవల 'అరుణతార'లో సీరియల్‌గా నడుస్తోంది సాహిత్యాన్ని స్థానికీకరణం(Localization of literature) చేస్తూ ఒక నూతన విప్లవ సాహిత్య ధోరణిని అల్లం రాజయ్య ఆధునిక సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. మాండలికంలో ప్రజాసాహిత్యాన్ని రాయడం అంటే ఏమిటో రచయితలకి నేర్పాడు బి శ్రీరాములు 'బతుకుపోరు' అనే నవల రాశారు ఉప్పల నరసింహం, సి హెచ్ మధు. వంటి సభ్యులు విప్లవ కథానికలు రాస్తున్నారు విరసం సిటీ యూనిట్ చెరబండరాజు మీద ఒక కవితా సంకలనం వేశారు. ఇప్పటికీ విరసంలో కవిత్వం రాసే వాళ్ళసంఖ్య ఎక్కువగా ఉంది. అరుణతార, సృజన ఇంకా ఇతర దిన వార పత్రికల్లో విరసం సభ్యులు వచనకవితలూ, పాటలూ, రాస్తున్నారు. విరసం అధికార పత్రికగా అరుణతార పాఠకుల సంఖ్యని పెంచుకుంటోంది.

సాహిత్య సైద్ధాంతికరంగాల్లో వాదోపవాదాల్లో 'పండితుల' సంఘంగా మారిన అరసం మీదా, అభినవ ఆధ్యాత్మికవాది ఆర్ ఎస్ ఎస్ దర్శనం మీదా, కుహనా విప్లవసేనమీదా, కమ్యూనిస్టు వ్యతిరేకవిషమయిన అనుభూతి వాదంమీదా విరసం గొప్ప విజయాల్ని సాధించింది. మార్క్సిజం-లెనినిజం, మావో ఆలోచనా విధానం వెలుగులో విరసం సభ్యులు శాస్త్రీయమైన సాహిత్య విమర్శని అభివృద్ధి చేస్తున్నారు. కె వి రమణారెడ్డి, చెంచయ్య, సంగ్రామ్ బాలగోపాల్ ఈ ఏడుమిది నెలల్లోనూ సాహిత్య విమర్శని సంపన్నం చేశారు త్రిపురనేని మధుసూదనరావు రాసిన 'గతితార్కిక సాహిత్య భౌతికవాదం' మెల్ల మెల్లగా చర్చనీయాంశం అవుతోంది కె వి ఆర్, నమ్మి విద్యావిధానంమీదా, జాతీ మహిళా సమస్యల మీదా వ్యాసాలు రాస్తున్నారు. వరవరరావు సృజనసంపాదకీయాల్లో జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలమీదా, ప్రజలపోరాటాలమీదా విశ్లేషణాత్మకమైన సమాచారాన్ని ఇస్తున్నాడు. బాలగోపాల్ విభిన్నరంగాలలో కృషిచేస్తున్నాడు సాహిత్యం,తత్వశాస్త్రం మీదనేకాక పోలెండ్ సంక్షోభం మీదా, జాతుల సమస్యమీదా భాషా సమస్యమీదా రాస్తున్నాడు. తత్వశాస్త్రంలో రివిజనిస్టులమీదా, నవ్యమానవవాదుల మీదా వ్యాసాల్లోనూ, బహిరంగచర్చల్లోనూ త్రిపురనేని మధుసూదనరావు వాదోపవాదాలు చేస్తున్నాడు నవ్యమానవ వాదులు మార్క్సిజాన్ని వక్రీకరిస్తున్న పద్ధతిని బహిర్గతం చేసి, వాళ్ల

హేతువాద పదాడంబర, వెనకదాగివున్న నిజస్వరూపాన్ని నిరూపిస్తున్నాడు. నాస్తిక హేతువాదాలు గతితార్కిక భౌతిక వాదంలో అవిభాజ్యమైన భాగం అని నాస్తిక, హేతువాదులకి నచ్చచెప్పడానికి ప్రయత్నం చేస్తున్నాడు. అఖిలభారత రచయిత సంఘ మహాసభపేరుతో విశాఖపట్నంలో జరిగిన ప్రభుత్వవిధేయరచయితల సభని వామపక్ష, ప్రగతిశీల రచయితలు బహిష్కరించడానికి విశాఖ విరసం యూనిట్ ప్రశంసనీయమైన కృషిచేసింది.

విరసం సభ్యులు పోరాటాల ఉద్యమంలోనూ, విద్యార్థి యువజన ఉద్యమాలలోనూ చురుగ్గా చొరవతో పనిచేస్తున్నారు. కార్మిక రైతాంగంతో మమేకం అయ్యేదిశగా ప్రయాణం చేస్తున్నారు. ఇప్పటికే కొంతమంది విరసం సభ్యులు రైతాంగపోరాటాలలో పాల్గొంటున్నారు ఉదారవాద, సంస్కరణవాదాలనుంచీ విశ్య ఆత్మవిమర్శతో బయటపడటానికి ప్రయత్నం చేస్తున్నారు వివిధ రంగాలలో పని చేస్తున్న విరసం సభ్యుల వాటి మధ్య అన్యోన్యసంబంధాల్ని దృష్టిలో పెట్టుకోవాలి. చురుగ్గానూ, చొరవతోనూ పనిచేస్తున్న సభ్యుల సంఖ్య గణనీయంగానే వున్నా ఈ సంఖ్య ఇంకా పెరగవలసి వుంది. మొత్తం విరసం సభ్యులు అందరూ ఇంకా శ్రద్ధగా ఉత్తేజకరంగా పనిచేయవలసివుంది అధ్యయనంచెయ్యడమేకాక కార్మికరైతాంగంతో మమేకం చెందడానికి విరసం సభ్యులు గ్రామాలకి తరలి వెళ్ళే కార్యక్రమాన్నితీసుకోవాలి. పోరాట ప్రాంతాల్ని అధ్యయనం చెయ్యాలి. పోరాటాల్తో ప్రత్యక్ష సంబంధం పెట్టుకోవాలి.

విప్లవ సాహిత్యాన్ని ప్రతిఘటించడానికి ప్రజావ్యతిరేక. ఔత్సాహిక రచయితలు అనేక అశాస్త్రీయవాదాల్ని ప్రచారం చేస్తున్నారు అనుభూతివాదం పేరుతో, మినీకవితా విప్లవం పేరుతో అపసిద్ధాంతాలు స్వైరవిహారం చేస్తున్నాయి అనుభూతి వ్యక్తినిష్ఠంకాదు సామాజికతతో సంబంధంలేని అనుభూతి నిలవటానికి వేదికలేదు కవిత్వం చిన్నదిగా ఉండాలా, పెద్దదిగా వుండాలా అనేది కవిత్వ సమస్యకాదు కవి చెప్పదలచిన విషయాన్ని బట్టి సైజు వుంటుంది మినీ కవితని కవిత్వంలో విప్లవంగా చిత్రించడం అర్థరహితం. సైన్సుఫిక్షన్ పేరుతో 'చేతబడి' నవలల్ని కొంతమంది ప్రముఖులురాస్తున్నారు. ఈ సాహిత్యం సాహిత్యాన్నీ శాస్త్రాన్నీకూడా దెబ్బతీస్తుంది. ఈ తప్పుడు ధోరణులమీద విరసం సభ్యులు శాస్త్రీయమైన, సహేతుకమైన విమర్శలు చేశారు. పోతన, వేమనవంటి కవుల్ని విప్లవ కవులుగా, ప్రజా

కవులుగా ప్రచారంచేస్తూ విప్లవ సాహిత్యంమీద దెబ్బతీయటానికి ప్రభుత్వం, కొంత మంది ఆస్థానపండితులూ ప్రయత్నం చేస్తున్నారు వేమనకవిత్వాన్ని వేమనపూర్వ కవుల్తో పోల్చిచూపి వేమన పద్యాలలోని ప్రగతిశీల అంశాన్ని విశ్లేషించడం శాస్త్రీయ మైన పద్ధతి ఈనాటి విప్లవ సాహిత్యంతో పోల్చిచూడటం చారిత్రిక దృష్టిలేని అశా స్త్రీయ పద్ధతి. వేమనమీద విజయవాడలో బహిరంగసభ ద్వారానూ, పోతన మీద వరంగల్ యూనిట్ చర్చని ఏర్పాటుచేసి విరసం సభ్యులు శాస్త్రీయమైన పద్ధతిలో పోరాటం చేశారు.

విరసం మీదా, విరసం సభ్యులమీదా నిర్బంధాలూ అణిచివేతలూ కొన సాగుతూనేవున్నాయి. సి హెచ్. మధు ఇంటిమీద పోలీసులు దాడిచేశారు. అంప శ్రీని ఏ కార్యక్రమాన్ని నిర్వహించకుండా చెయ్యడానికి భూస్వాముల, గ్రామపెద్దల మద్దతుతో పోలీసులు ఇబ్బంది పెడుతున్నారు. వరవరరావుని కేసుల్లో ఇరికించ డానికి కుట్రచేస్తున్నారు. చెరబండరాజు ఆరోగ్యం రోజురోజుకీ క్షీణిస్తోంది. ఈ దమనకాండని అధిగమించి విరసం పురోగమిస్తోంది. అఖిల భారత విప్లవ రచయితల సమాఖ్యని ఏర్పాటు చెయ్యడానికి విరసం కృషి చేస్తోంది కె వి రమణారెడ్డి, వర వరరావు ఈ కృషిలో భాగంగా కేరళ పి. సి. ఎఫ్ సమావేశాలలో పాల్గొన్నారు. పన్నెండు సంవత్సరాలపోరాట చరిత్రగల విరసం అఖిలభారత విప్లవ రచయితల్ని ఒకవేదికమీదకి సమీకరించగలదని అనేక ఇతర రాష్ట్రాల విప్లవకవులు ఆశిస్తున్నారు విరసం ఈ కర్తవ్యాన్ని నిర్వహిస్తుంది త్వరలోనే అఖిలభారత విప్లవ రచయితల సమావేశాన్ని ఏర్పాటు చేస్తుంది.

కామ్రేడ్స్

మనం చేసింది తక్కువ చెయ్యవలసింది ఎక్కువ. చేసిన కృషి నుంచీ గుణపాఠాలు నేర్చుకొని ఆత్మ విమర్శతో పురోగమిద్దాం.

విప్లవం వర్ధిల్లాలి.

విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి.

మాచర్ల

౧-౬-౮౨                    — త్రిపురనేని మధుసూదనరావు

# వివిధ సంస్థల, వ్యక్తుల నుండి సందేశాలు

ప్రస్తుతం దేశంలో విప్లవశక్తులు ఏకోన్ముఖంగా ఉండడం లేదనీ, రాజకీయ సమైక్యం లేకుండా సాంస్కృతిక సమైక్యం అసాధ్యమైనా, ఒకే విధంగా ఆలోచించే బృందాలమధ్య పరస్పర సంబంధాలు సాధ్యమేగాక, వాంఛనీయమనీ ఈ విషయంలో ఒక దశాబ్దంపైగా అనుభవం ఉన్న విరసం చొరవ తీసుకోవాలనీ, తీసుకోగలదనీ ఢిల్లీ నుండి కంచన్‌కుమార్ సందేశం పంపారు.

బెంగాల్ నుండి దేవవ్రతపాండా తమ సందేశంలో ఇలా పేర్కొన్నారు; కళ కళ కోసమే అనే సిద్ధాంతాన్ని వ్యతిరేకించే రచయితలను, కళాకారులను, మేధావులను సమీకరించే ఉద్దేశంతో 19,9లో మేం కిన్వినర్ల కౌన్సిల్ ఏర్పాటు చేసుకున్నాం. విరసం చూపినదారి మాకు ఉత్తేజాన్నిచ్చింది. 1980లో చెరబండరాజు, గద్దర్ కలకత్తాకు వచ్చి ఆంధ్రప్రదేశ్ లోని సాంస్కృతిక రంగంలో వస్తున్న పరిణామాలను వివరించారు. మార్క్సిజం-లెనినిజం మావో ఆలోచన విధానం వెలుగులో నూతన ప్రజాస్వామిక సాంస్కృతిక రంగంలో మేం తప్పటడుగులు వేస్తున్నాం ఇందిరా నిరంకుశత్వానికి వ్యతిరేకంగా కూడ సాంస్కృతిక రంగాన్ని నిర్మించాలనీ, దానికి సూత్రబద్ధమైన చర్చ అవసరమనీ మేం భావిస్తున్నాం. మా రాష్ట్రంలో 'వామ' పక్ష ప్రభుత్వం విప్లవ కళాకారులమీద అణచివేత చర్యలను అమలుచేస్తుంది. నదియా జిల్లాకు చెందిన ఐదుగురు సాంస్కృతిక కార్యకర్తల్ని అరెస్టు చేసింది. విరసం సభ్యుల్లాగే మేమూ కష్టనష్టాలను భరిస్తూనే ముందుకు సాగుతున్నాం. రాగల కాలంలో మన సంస్థలు రెండూ పరస్పరం రచనలను అనువదించుకుంటూ దగ్గరకు రాగలవని ఆశిస్తున్నాం.

తమిళనాడు నుండి మనోహరన్ పంపిన సుదీర్ఘమయిన సందేశ సారాంశం యిది: ప్రియమైన కామ్రేడ్స్! విప్లవ రచయితలసంఘం తొమ్మిదవ సమావేశంలో పాల్గొనే అవకాశం కలిగినందుకు సంతోషంగాను, గర్వంగాను ఉంది. కళాసాహిత్యాలు కేవలం సౌందర్యవాదంతో కూడిన ఉపాలంకరణాలు కావనీ, అవి కష్టజీవుల విమోచనోద్యమ అనుభవాలేనని భావించే తమిళనాడు కార్మికకర్షకవర్గాలకు, ప్రజానీకా

నికి ఆంధ్రప్రదేశ్ విప్లవ రచయితలూ, కళాకారులూ ఎంతో ఉత్తేజాన్నిస్తున్నారు. దిగంబర కవిత్వంవంటి ధోరణులకు విప్లవకళాసాహిత్యాలు గతతాత్కాలికంగా తమలో విలీనం చేసుకున్నాయని మా భావం. విప్లవ సాహిత్యంకంటే జననాట్యమండలి పాటలు, ఆటలు మాకు మహోత్తేజం కలిగించాయి. చైనాలోని సాంస్కృతిక విప్లవకాలానికి చెందిన సాంస్కృతిక ఆచరణ రీతులకూ, వీటికీ తెలిసిగానీ, తెలియక గానీ పెద్ద పోలిక కన్పిస్తూవుంది. కళాకారులకీ, ప్రజానీకానికీ మధ్యగల అంతరాన్ని తొలగించగల అవకాశాన్ని ఆంధ్రప్రదేశ్ విప్లవకళా సాహిత్యాలు సూచిస్తున్నాయి. ఈ నాడు పచ్చిబూతు శృంగారాన్ని వెదజల్లుతున్న పత్రికలూ, పుస్తకాలూ సినిమాలు మన యువకుల పాలిటి నల్లమందు గుళికలు. మన విద్యాసంస్థల్లో స్వేచ్ఛాభావాలతో కూడిన కళలను హతమారుస్తున్న పాలకవర్గాల కుట్ర కొనసాగుతూంది. తమ సోవియట్ దుష్టపథకాలకు అనుగుణంగా మన చరిత్రను తిరగరాస్తూ, వ్యాఖ్యానాలు చెబుతున్న రివిజనిస్టు పండిత మండలల్లో సాంస్కృతికమైన విలసతత్వం ఉంది. విప్లవరచయితలు నేడు ఫైనల్ చేసుకోవలసిన సమస్యల్లో ఇవి కొన్ని మాత్రమే. విప్లవ కార్యకలాపాలు ఎక్కడ పెల్లుబికినా, తమిళనాడులో ముఖ్యంగా ధర్మపురి జిల్లాలో పోలీసు దాడులకు మొదటి గురిసాంస్కృతిక కార్యకర్తలే. ఆంధ్రా కామ్రేడ్స్‌లాగే మేంకూడ కళాసాహిత్యాలు ప్రజలకోసమేననే మావో సిద్ధాంతాన్ని నమ్ముతున్నాం. కళాసాహిత్యాలు ప్రజల కోసమే అంటే వారి చైతన్యాన్ని పదునెక్కించటమనే. కళాకారుల, రచయితల ఐక్య సంఘటనకు గల అవకాశాన్ని గురించి ఆలోచిస్తారని ఆశిస్తున్నాం.

సభలకు రాలేకపోయిన జనకీయ సాంస్కారిక వేది (కేరళ) కార్యదర్శి సివిక్ చంద్రన్ అఖిల భారత స్థాయిలో విప్లవ సాంస్కృతిక సంస్థల మధ్య సమన్వయం గురించి తమ దృక్పథాన్ని వ్రాతపూర్వకంగా ఇల్లా పంపారు: నూతన ప్రజాస్వామిక విప్లవంలో ప్రధాన అంతర్భాగంగా నూతన ప్రజాస్వామిక సంస్కృతి కోసం పోరాటం భారతదేశంలో విప్లవ సాంస్కృతిక సంస్థలన్నిటినీ ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య సిద్ధాంత పరంగానూ, ఆచరణపరంగానూ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి చైనా సాంస్కృతిక విప్లవం ఉత్తేజాన్నిచ్చి, మళ్ళీ జవ కలిగించిన దశలో నక్సల్బరీ తిరుగుబాటు జరిగింది. ఈ నాడు డెంగ్ నాయకత్వాన చైనాలో అధికారాన్ని హస్తగతం చేసుకున్న నయా రివిజనిస్టులు నూతన ప్రజాస్వామిక విప్లవానికి, దీర్ఘ కాలిక యుద్ధానికి సంబంధించిన సిద్ధాంతానికి

మాత్రమే మావో దోహదాన్ని పరిమితం చేయడం ద్వారా ఆ గొప్ప అభివృద్ధిని వాళ్ళు తోసివేస్తున్నారు. ఈ తరుణంలో విప్లవ సాంస్కృతిక సంస్థలు సాంస్కృతిక విప్లవానికి చెందిన విప్లవాచరణ ద్వారా మార్క్సిజం-లెనినిజం- మావో ఆలోచన విధానాన్ని బహిరంగాంగా సమర్థించే వైఖరిని అవలంబించాలి. ఈ ప్రాతిపదిక పైనే సమన్వయ సంఘ స్థాపనలో పాల్గొనేందుకు మేం సిద్ధం.

పని ఒత్తిడివల్ల సభలకు రాలేకపోయిన ఓ. పి. డి. ఆర్ జనరల్ సెక్రటరీ మహాసభల విజయాన్ని కోరుతూ వైర్ ద్వారా తమ సందేశాన్ని పంపారు.

ఆంధ్రప్రదేశ్ ఓ. పి. డి. ఆర్, ఆర్గనైజింగ్ సెక్రటరీ కె బాలయ్య తమ సందేశంలో ఇలా పేర్కొన్నారు; దేశం ఈనాడు తీవ్రమయిన సాంఘిక, ఆర్థిక రాజకీయ సంక్షోభంలో చిక్కుకొనివుంది. తమ శ్రమశక్తి ద్వారా, తమ మేధా సంపత్తి ద్వారా సృష్టించబడుతున్న సంపద తమకు దక్కటంలేదనే వాస్తవాన్ని ప్రజలు గుర్తిస్తున్నారు. ఈ అనుభవం అలజడికి, ఆందోళనకు, ఉద్యమాలకు పోరాటాలకు దారి తీస్తుంది. ప్రజలను దోపిడీ చేసేందుకు బ్రిటీషు వలస పాలకులు రూపొందించిన నిర్బంధ చట్టాలను భారతపాలక వర్గాలు గత 35సంవత్సరాలుగా మరింత పకడ్బందీగా అమలు చేస్తున్నాయి. ఈ నిర్బంధాన్ని, దోపిడీని ఐక్యంగా ప్రతిఘటించమని ఉద్బోధించే రచయితలపైన, కళాకారులపైన పాలకులు దమనకాండ సాగిస్తున్నారు. రచనలను, ప్రదర్శనలను నిషేధిస్తున్నారు. కుట్రకేసులు బనాయిస్తున్నారు. కలం యోధులపై జరుగుతున్న దాడులలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మిగతా ప్రభుత్వాలకు మార్గదర్శిగా వుంది. ఈ నిర్బంధాన్ని సుసంఘటిత ప్రజాతంత్ర హక్కుల ఉద్యమం మాత్రమే ఎదుర్కొన గలుగుతుంది ఈ విరసం మహాసభలలో ప్రజాతంత్ర ఉద్యమాలలో సాహితీ సాంస్కృతిక సంస్థల కర్తవ్యాలపై విస్తారంగా చర్చలు జరగాలని ఆకాంక్షిస్తున్నాను.

తమ బాధామయ జీవితగాధల్ని దురాశాపూరితమైన యాజమాన్యానికి దళారీ ట్రేడ్ యూనియన్లకూ, కార్మికవ్యతిరేక నల్లచట్టాల ప్రభుత్వానికి వ్యతిరేకంగా తాము చేసే పోరాటాలను గానంచేస్తూ, విప్లవ రచయితలు కార్మిక రైతాంగ పోరాటాలతో మరింతగా మమేకం అవుతారని ఆశిస్తూ సింగరేణి కార్మికసమాఖ్య సందేశం పంపింది

కార్మికుల సమస్యలపైన, స్త్రీల సమస్యలపైన, పట్టణ మధ్య తరగతుల సమస్యలపైన ఇంకా ఎక్కువగా రచనారూపాల్ని అందించి. నూతన ప్రజాస్వామిక

విప్లవలక్ష్యంగా సాంస్కృతిక రంగంలో కృషి చేస్తున్న మాకు చేయూతనివ్వాలని అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య తన సందేశంలో విరసాన్ని కోరింది

ఆదినుండీ కుట్రకేసుల్లాంటి నిర్బంధాల్ని ఎదుర్కొంటూ కష్టజీవుల పక్షాన నిలిచిన విరసం నూతన ప్రజాస్వామిక సంస్కృతిని సాధించేవరకు ముందుకు సాగాలని ఆంధ్రప్రదేశ్ పి డి యస్. యు. తన సందేశాన్ని వినిపించింది.

ఈనాడు దోపిడీ అనుకూల సాహిత్య, సంస్కృతులకు వ్యతిరేకంగా ప్రజా సాహితీ సాంస్కృతికోద్యమాన్ని నిర్మించడానికి విరసం మహాసభల కృషి తోడ్పడ గలదని ఆంధ్రప్రదేశ్ డి. యస్ ఓ తన సందేశంలో భావించింది.

మహాసభల విజయాన్ని కోరుకుంటూ ముత్యంగారు వైర్ ద్వారా సందేశ మిచ్చారు.

"చీకటి గోతుల్లో మిణుకు మిణుకు మంటున్న నక్షత్రాల గొంతునులుము తున్నారు. మనం సాయుధం కావాలి. మృత్యు కవాటాల్లో పెనుగులాడుతున్న చిన్ని వెలుగు గుండెల్ని నలిపేస్తున్నారు, మనం ఉక్కు పిడికి లెత్తాలి'' అంటూ, చీలిన దారుల్ని దగ్గర చెయ్యాలని కోరుకుంటూ, విరసం తొమ్మిదవ మహాసభలు స్పష్టమ యిన దృక్పథంతో ముందుకు పోవడానికి దోహదపడతాయని ఆకాంక్షిస్తూ ఏయున్ తన సందేశాన్ని పంపారు.

## రక్తంలో చావాలని ఉంది

—భూషన్

నేను రక్తంలో పుట్టాను
నేను పుట్టిన పది సంవత్సరాలకి
నాకు తెలిసింది
చావు ఉంటుందని
ఎటూ తప్పని చావు
ఈక కన్నా తేలికగా చావద్దని
హిమాలయాల కన్న ఉన్నతంగా
చావాలని ఉంది.
రక్తంలోనే చావాలని ఉంది.

# పల్నాటి పోరాటాల చరిత్ర

వక్త : సిరా                                        అధ్యక్షుడు : కె వి. ఆర్.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశం స్వయం సంపూర్ణ ఆర్థిక సామాజిక వ్యవస్థను ధ్వంసం చేశారేగాని అంతకంటే ఉన్నతమైన ఆర్థిక సామాజిక వ్యవస్థను ఏర్పాటుచేయలేదు. వినాశనం చేశారేగాని నిర్మాణం సాగించలేదు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలోని చేతివృత్తుల్ని ధ్వంసం చేశారు భూమిని వ్యాపార వస్తువుగా మార్చారు. రైతులకు భూమిపై సొంత హక్కు ఏర్పడింది. బ్రిటిష్‌వారి దోపిడీ విధానాలవల్ల చివరికి యీ భూములు రైతుల దగ్గర్నుంచి వడ్డీవ్యాపారుల చేతుల్లోకి, జమీందార్ల చేతులలోకి పోయాయి. బ్రిటిష్‌వారు నీటిపారుదల పద్ధతుల్ని అభివృద్ధి చేయలేదు. బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన జమీందారీ, రైత్వారీ శిస్తువసూలు పద్ధతులవల్ల రైతాంగం విపరీతమైన నిర్బంధాలకు, పన్నుల దోపిడికి గురయ్యింది. అనాదిగా ప్రజల అనుభవంలో ఉండిన అడవుల్ని బ్రిటిష్‌వారు తమ స్వాధీనం చేసుకుని రిజర్వు ఫారెస్టుక్రింద మార్చారు. ఈ అడవుల్లో ప్రజలు కట్టెలు కొట్టినా, ఆకు తెంపినా, పశువుల్ని మేపినా పన్ను కట్టాల్సిన దుస్థితి ఏర్పడింది.

బ్రిటిష్ పాలకుల దోపిడీ దౌర్జన్యాలవల్ల ప్రజలలో తీవ్ర అసంతృప్తి ఏర్పడింది, బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా రైతాంగం అనేక పోరాటాలు చేసింది. 1919 ఏప్రిల్‌లో జలియన్‌వాలాబాగ్‌లో బ్రిటిష్ పాలకులు కొన్ని వందలమంది ప్రజల్ని కాల్చిచంపటం, పత్రికాస్వాతంత్ర్యాన్ని వాక్స్వాతంత్ర్యాన్ని కాలరాయటం, ప్రజలపై తీవ్ర అణచివేత చర్యలకు పూనుకోవటం, పన్నుల్ని విపరీతంగా పెంచి ప్రజలదగ్గర్నుంచి దౌర్జన్యంగా వాటిని రాబట్టటం- వీటిమూలంగా భారత ప్రజలు బ్రిటిష్ పాలకులపట్ల యింతకుముందుకంటే తీవ్రంగా నిరసన ప్రదర్శించటానికి, బ్రిటిషు పాలకులను ఎదిరించటానికి సంసిద్ధమయ్యారు. ఇలాంటి స్థితిలో ప్రజల చైతన్యంకంటే వెనుకబడిన కార్యక్రమాల్ని తీసుకుంటే ప్రజలు తమనాయకత్వాన్ని కాలదన్నుతారని భయపడిన జాతీయ కాంగ్రెసు నాయకులు విధిలేని పరిస్థితులలో

సహాయ నిరాకరణోద్యమాన్ని చేపట్టారు. 1920 ఆగస్టు 1వ తేదీన కాంగ్రెసు మహాసభలో సహాయ నిరాకరణ తీర్మానం ఆమోదించ బడింది. విదేశ వస్త్రాలను, వస్తువులను బహిష్కరించటం, న్యాయస్థానాలను, పాఠశాలలను బహిష్కరించటం మొదలైన కార్యక్రమాలు తీసుకోబడ్డాయి. ప్రజలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడి, దౌర్జన్యాలపట్ల రగులుతున్న అసంతృప్తి నిరసన, ద్వేషం సహాయనిరాకరణోద్యమ కార్యక్రమాలలో బయటపడ్డాయి. బూర్జువాల ప్రతినిధులైన కాంగ్రెసు నాయకులు నిర్దేశించిన సాత్విక నిరసన దాటి ప్రజా పోరాటాలు ఉన్నత రూపాలను తీసుకున్నాయి.

దేశవ్యాపితంగా ప్రజలు సహాయ నిరాకరణోద్యమంలో ఎక్కువగా పాల్గొన్నారు. అందులో భాగంగా ఆంధ్రరాష్ట్రంలో గుంటూరు, కృష్ణ జిల్లాలలో, రాయలసీమ, తెలంగాణలోని కొన్ని జిల్లాలలో సహాయ నిరాకరణోద్యమం కాంగ్రెస్ నాయకులకు గుండెలు జారేట్లుగా ఉన్నత పోరాట రూపాలకు ఎదిగింది. ఈ ప్రాంతాలలో భూమి శిస్తులకు, అడవి చట్టాలకు వ్యతిరేకంగా పోరాటాలు సాగాయి.

ఈ కాలంలో గుంటూరు జిల్లాలో జరిగిన పోరాటాలలో - చీరాల పేరాల పట్టణ నిర్గమనోద్యమము, పల్నాటి పుల్లరి పోరాటం, పెదనందిపాడు ప్రాంతంలో జరిగిన పన్నుల నిరాకరణోద్యమము ముఖ్యమైనవి.

1921 ఏప్రిల్ 30, మే 1న బెజవాడలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ జాతీయోపసంఘం సమావేశమయ్యింది ఈ సమావేశంలో చేసిన తీర్మానాలలో ముఖ్యమైనవి — 1) గుంటూరుజిల్లా మొత్తంగా భూమిశిస్తు, పుల్లరి, ఆదాయపు పన్నులను జనవరి కిస్తీ పన్నులను చెల్లించకూడదు. 2) ప్లీడర్లు తమ వృత్తులు మానుకోవాలి, విద్యార్థులు పాఠశాలల్ని బహిష్కరించాలి, శాసనసభ్యులు తమ సభ్యత్వాన్ని వదులుకోవాలి. 3) పైవిధంగా చేయనివారి భూములను ఎవరూ జిరాయితీ చేయగూడదు. అలాంటి వారికి యిళ్ళను అద్దెకు ఇవ్వరాదు వారు ఉద్యోగరీత్యా గ్రామాలకు వచ్చినప్పుడు ఏమాత్రము సాయము చేయకూడదు

కాంగ్రెసుపార్టీ సహాయ నిరాకరణ తీర్మానం గావించిన తర్వాత, దీనిని

అమలు జరుపటానికి జిల్లా కాంగ్రెస్ నాయకులు వివిధ ప్రాంతాలకు వెళ్ళి సభలు, సమావేశాలు జరిపారు కొన్నిచోట్ల శాంతి సైనికులను ఏర్పరచారు.

బాపట్ల తాలూకా పెదనందిపాడు ఫిర్కాలోని పలుగ్రామకరణాలు తమ పదవులకు రాజీనామా చేశారు. పల్నాడు తాలూకాలో గంగవరం అనే గ్రామంలో నవంబర్ 21న పల్నాడు తాలూకా మహాసభ జరిగింది. గురజాలలో మరొకసభ జరిగింది. పన్నులు చెల్లించకుండా వుండేందుకు; శాంతిసైన్యంలో చేరుటకు యీ సభలలో నిర్ణయాలు చేసుకున్నారు.

ప్రజలు పోరాటాలకు సంసిద్ధం కావటం చూసి భీతిచెందిన బ్రిటిష్ పాలకులు ప్రజలపై తీవ్ర నిర్బంధాన్ని అమలు జరిపారు. ప్రభుత్వ అధికార్లు సైనిక పోలీసు బలగాలతో గ్రామాలపైబడి విచ్చలవిడిగా రైతుల ఆస్తులను జప్తు చేశారు ఉద్యమ నాయకులను అరెస్టు చేశారు స్త్రీలపై అత్యాచారాలు జరిపారు. గ్రామస్థులపై అపరాధపు పన్నులు విధించి భయభ్రాంతుల్ని చేయటానికి ప్రయత్నించారు. గుంటూరు మండల కాంగ్రెస్ సంఘాధ్యక్షులగు ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి నరసింహాచారి గార్లు గుంటూరు జిల్లా కలెక్టర్‌కి పల్నాడు తాలూకాలో అడవి చట్టాలవల్ల ప్రజలు పడుతున్న కష్టాలను నివేదించటానికి వెళ్ళగా, జిల్లా మేజిస్ట్రేటు గురజాలలో వారిద్దరికి చెరిఒక సంవత్సరం జైలుశిక్ష విధించారు. పెదనందిపాడు ఫిర్కాలో పన్నుల నిరాకరణోద్యమం నడుపుతున్న పర్వతనేని వీరయ్యా చౌదరిగారిని అరెస్టుచేశారు. 1922 ఫిబ్రవరి చివరిలో పల్నాటిసీమ అడవి పుల్లరి వివాదం విషయంలో కాల్పులు, అరెస్టులు గావించారు. మంచాలపాడులో పుల్లరి పోరాటాన్ని నడిపిన కన్నెగంటి హనుమంతును కాల్చిచంపారు.

## పల్నాటి పుల్లరి పోరాటం – కన్నెగంటి హనుమంతు

---

ఒక్క సుముహూర్తాన ఉప్పొంగి భరతోర్వి
స్వాతంత్ర్య శంఖము సింహనాదము చేయ
మేరువై నిలిచిందిరా – పలనాడు
ముందుండి పోరిందిరా!
కన్నెగంటి హనుమంత కోరమీసముద్రిప్పి

పలనాటి ప్రజలచే పన్ను లెగబెట్టించి
బలియిచ్చె హనుమంతును - పలనాడు
వరప్రభుత్వపు గుండ్లకూ—

—ఏ వి శివయ్య గీతం నుండి

పల్నాడు తాలూకాలో అడవులు ఎక్కువ ఉండేవి పుల్లరి బాధలతోపాటు, ఫారెస్టు అధికారుల దౌర్జన్యాలు మితిమీరాయి

పల్నాటిసీమ పరిస్థితులను విచారించేందుకు గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘం ఉన్నవ లక్ష్మీనారాయణగారిని, మాడభూషి నరసింహాచారిగారిని అక్కడికి పంపింది. వీరు పల్నాటిసీమలోని గ్రామాలకు వెళ్ళి ప్రజల యిబ్బందుల్ని స్వయంగా విచారించి తెలుసుకుని, యీ విషయాల్ని జిల్లా కలెక్టర్‌కి వివరించారు. అందులో రెండు అంశాలు—

1) పల్నాడు తాలూకా కళ్ళగుంటలో భూవసతి, పశువులు, మేకలు గల కుటుంబాలు కాంపౌండు ఫీజు కట్టుటకు తమ ఆస్తులను అమ్మివేయవలసి వచ్చింది. 2) వినుకొండ తాలూకా ఈపూరు సమీపంలోని ఊటచర్ల గ్రామస్తులకు వచ్చే ఆదాయమంతా ఫారెస్టు అధికార్ల లంచాలకు, ఫారెస్టు కేసుల్లో ప్లీడర్ల కిచ్చు ఫీజులకు, దారిబత్తెమునకు సరిపోతున్నది.

అడవి చట్టాలవల్ల, ఫారెస్టు అధికారుల దోపిడి దౌర్జన్యాలవల్ల రైతాంగం అనుభవిస్తున్న అనేక కష్టాలలో పైన చెప్పినవి రెండు ఉదాహరణలు మాత్రమే.

ప్రజల తరపున ఉన్నవ లక్ష్మీనారాయణగారు కలెక్టర్ ముందు కొన్ని డిమాండ్లు పెట్టారు. అందులో కొన్ని—

1) జిల్లాలో కలప అడవులు లేవు కాబట్టి కూపుల పద్ధతి అనవసరము పుల్లరి ఖండముగా ఉండాలి.

2) పుల్లరి రేట్లు పూర్వము లాగా ఉండాలి.

3) ప్రజలకు అడవిలో ఆకును కోసుకునేందుకు అధికారం ఉండాలి.

4) ఒక్కపుల్లరితో సంవత్సరమంతా జిల్లాలో ఎక్కడైనా పశువుల్ని మేపుకోవచ్చు.

5) రైతుల పొలాలలో పశువులు పడినప్పుడు బందెకు పెట్టవచ్చు. అయితే కొంబాడు ఫీజు వసూలు చేయరాదు.

పై డిమాండ్లను కలెక్టర్ ఒప్పుకోలేదు. పైగా, రైతులు ఫారెస్టు ఉద్యోగులను అడ్డగించుట, కొట్టుట, సప్లయి లివ్వకుండుట మానివేసి, ఆందోళన ఏమాత్రం చేయకుండా వుండాలని, అలాకాక ప్రజలు దౌర్జన్యం చేసినట్లయితే కొంత రిజర్వును తెప్పించి ఆ ఖర్చులను రైతులనుండి వసూలు చేస్తానని బెదిరించాడు.

సైనిక ఖర్చులకు రైతులనుండి అపరాధపు పన్ను వసూలు చేయటం అన్యాయమని, పుల్లరి చెల్లించకుండా పశువుల్ని అడవులలో మేపుకునేటందుకు, కట్టెలు కొట్టేందుకు రైతాంగానికి అనాదిగా హక్కు వుందని ఉన్నవ లక్ష్మీనారాయణ గారు కలెక్టర్‌తో వాదించారు. అయినా లాభం లేకపోయింది.

రైతులు పుల్లరి కట్టకుండే పశువుల్ని అడవికి పోనిచ్చేది లేదని కలెక్టర్ చాటింపు వేయించాడు. ఫారెస్టు అధికారులు పోలీసు బందోబస్తుతో గ్రామాలపై బడి పశువులను బందెకు తీసుకపోవటం కొనసాగించారు. వందలాది రైతులు ఫారెస్టు అధికారుల వెంటబడి తమ పశువుల్ని విడిపించుకోవటానికి ప్రయత్నించారు. దీనితో నిరంకుశాధికారులు, పోలీసులు రెచ్చిపోయారు. పోలీసు, సైనిక బలగాలు గ్రామాలను చుట్టుముట్టి మూకుమ్మడిగా అరెస్టులు చేశారు. పన్నులు, పుల్లరి చెల్లించే వరకు ప్రజల ఆస్తుల్ని జప్తు చేశారు. అరెస్టు చేసిన వారిని విడుదల చేయాలని కోరిన ప్రజలపై కాల్పులు సాగించి నానా భీభత్సం చేశారు. పల్నాటి సీమలో యిలాంటి సంఘటనలు వెల్దుర్తి, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం, మిటుకూరు, రామాపురం, మొదలైన గ్రామాలలో జరిగాయి. మించాలపాడులో పోలీసుల అక్రమాలు పరాకాష్ఠ చెందాయి.

ప్రజలు ఫారెస్టు అధికార్లను, పోలీసులను సాంఘిక బహిష్కరణ చేశారు. అధికారులకు చాకళ్ళు, మంగళ్ళు పనిచేయలేదు. దుకాణాదార్లు సరుకులు యివ్వలేదు. హోటళ్ళవారు తిండిపెట్టలేదు. మాచెర్లలో మకాం వేసిన జిల్లా కలెక్టర్‌కు, పోలీసు సూపరింటెండుకు కూడా పాలు, గ్రుడ్లు దొరకని స్థితి ఏర్పడింది.

ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘం ఆదేశాల మేరకు రాష్ట్రప్రజలు 1922 జనవరి, ఫిబ్రవరి వాయిదాల ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వానికి భూమిశిస్తు అడవిపుల్లరి మొదలైన పన్నులు నిలుపుదల చేసినప్పుడు, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా లోని అనేక గ్రామాలలో రైతులు పన్నులు చెల్లించటానికి నిరాకరించారు దీనికి పూర్వమే చాలకాలంనుండి అడవిపుల్లరు, ఫారెస్టు అధికారుల అక్రమాల విషయంలో పల్నాడు తాలూకాలోని రైతులకు ప్రభుత్వ అధికారులకు మధ్య కొన్ని ఘర్షణలు జరిగాయి

గుంటూరు జిల్లా కలెక్టర్ వర్నెర్ రిజర్వు పోలీసుదళాలను, గుర్రపు సవారి సిపాయి దళాలను వెంట తీసుకుని పల్నాడు తాలూకాకు వెళ్ళి అక్కడవున్న రెవెన్యూ, పోలీసు, ఫారెస్టు ఉద్యోగస్థులకు తన వెంటవున్న పోలీసు దళాలను సహాయమిచ్చి. తాను స్వయంగా వారివెంట వెళ్ళి, పన్నులు చెల్లించక నిలిచిఉన్న గ్రామాలలో పన్నులు వసూలు చేయమని ఆజ్ఞాపించాడు. ఆ అధికారులు జంగ మహేశ్వరపురము, రామాపురం, జెట్టిపాళెం, మించాలపాడు గ్రామాలలో పన్నులు వసూలు చేయటానికి ప్రజల ఆస్తుల్ని జప్తుచేశారు. పన్ను వసూళ్ళకు అడ్డం వచ్చారని, తమపై దౌర్జన్యం చేశారనే సాకుతో ఆ కిరాతక ఆఫీసర్లు అక్రమంగా ప్రజల్ని నిర్బంధించి, తుపాకులతో కాల్చి – భీభత్సం సృష్టించారు

1922 ఏప్రిల్ 26 ఉదయం 8 గంటలకు ఫారెస్టు రేంజరు, డిప్యూటీ రేంజర్, ఫారెస్టురు, గార్డులు, వాచర్లు మొదలైన ఫారెస్టు అధికారులు మించాలపాడుకు వచ్చారు. ఊరవెలుపల బావిదగ్గరకు కొందరు గ్రామస్తులను పిలిపించి "మీరు పుల్లరి కట్టలేదు. మీ పశువులను బందెల దొడ్డికి తోలెదము" చెప్పారు. "మేము పుల్లరి చెల్లిస్తాము. మా పశువులను తోలుకుని వెళ్ళవద్దని" రైతులు ప్రతిమాలారు. అక్కడికి వెళ్ళిన రైతులలో కన్నెగంటి హనుమంతు కూడా ఉన్నాడు

"ఊరిపుల్లరి మొత్తం నేనేకట్టి, తర్వాత వసూలు చేసుకుంటాను. మీరు పశువుల్ని పట్టుకోవద్దు" అని కన్నెగంటి హనుమంతు ఫారెస్టు అధికారులకు నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. ఇంతలో దుర్గి పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు రాఘవయ్య నాయుడు, కొందరు కానిస్టేబుల్స్ కరణం యడవల్లి సదాశివయ్య అక్కడికి వచ్చారు. బావిదగ్గర నీళ్ళుత్రాగి పడుకునివున్న సుమారు నూరుగేదెలను పట్టుకున్నారు. ఎంత

ప్రాధేయపడినా ఫారెస్టు అధికారులు వినకపోవటంతో రైతులు గ్రామానికి తిరిగివచ్చారు.

పోలీసులు, ఫారెస్టు అధికారులు పశువులను తోలుకుని వాగువద్దకు చేరారు. కన్నెగంటి హనుమంతు అల్లుడు పసుపులేటి చెన్నయ్య, యింకా కొంత మంది రైతులు పశువుల్ని విడిపించుక రావటానికి వెళ్ళారు. "నా పాడిగేదెనైనా వదిలిపెట్టండని" చెన్నయ్య, పాడిగేదె కొమ్ముపట్టి లాగాడు ఇంతలో ఒక పోలీసు కానిస్టేబుల్, తుపాకి మడమతో (వెనుకభాగం) చెన్నయ్య ఎడమచేతిమీద రెండుపోట్లు పొడిచాడు. ఇంకొక కానిస్టేబుల్ అదేచేతిమీద రెండు దెబ్బలు కొట్టాడు. ఈ సంఘటనను చూస్తున్న ఒక స్త్రీ "ఓ హనుమంతు నీ అల్లుడిని చంపుతున్నారు" అని కేకేసింది ఈ కేకవిని, చింతచెట్టు వద్ద నిలబడి ఉన్న హనుమంతు ఆ స్థలానికి పోయి "మీరు ఆ పసివాన్ని ఎందుకు కొట్టారు? పల్లరి అంతా నేనే చెల్లిస్తాను. పశువుల్ని వదలండి" అని పోలీసులతో ఎడమచేయిఎత్తి వాదిస్తుండగా పోలీసులు తుపాకులతో అతని ఎడమచేతిపైన కాల్పులు జరిపారు. హనుమంతు ఎడమచేయి విరిగిపోయింది. "కాల్పులు చేయకండి ఆపండి" అని హనుమంతు అన్న వెంటనే పోలీసులు అతని ఎడమ డొక్కలో కాల్పులు జరిపారు అంతటితో అతను క్రింద పడిపోయాడు "దాహం దాహం" అని అరిచాడు. ఈ కాల్పుల్లో గుండుదెబ్బలు తగిలిన హనుమంతు జీతగాడు, సబ్‌యిన్స్పెక్టర్ గుర్రపుబండి నడిపే అతను గాయాలు తగిలిన వెంటనే చనిపోయారు.

విపరీతమైన దప్పికతో బాధపడుతున్న హనుమంతుకు గొల్ల అచ్చమ్మ నీళ్ళుయివ్వటానికిరాగా పోలీసుకానిస్టేబులు ఆ నీళ్ళను త్రాగేసి చెంబును విసిరిపారేశాడు. హనుమంతు భార్య గంగమ్మ చంటిబిడ్డను చంకనిడుకుని చెంబుతో నీళ్ళు తీసుకుని వెళ్ళగా, నీవు వస్తే కాల్చి చంపుతామని పోలీసులు బెదిరించారు. విపరీతమైన దప్పికతో బాధపడుతూ కన్నెగంటి హనుమంతు రాత్రి 12 గంటలకు చనిపోయాడు.

కొందరు పోలీసులు పశువులను, శవాలను కావలాకాస్తూ, గ్రామ ప్రజలను వాగులోకి పిలిపించి కలెక్టర్ ఎదుట కూర్చుండబెట్టారు. ఆ సమయంలోనే యింకకొందరు పోలీసులు గ్రామంలో ప్రవేశించి దోపిడిచేశారు. అనేక సామానులు ఎత్తుకపోయారు. ఆరోజు సాయంత్రం పశువులను పోలీసులు దుర్గి గ్రామంలోని

బందెలదొడ్డికి తోలుకుని వెళ్ళారు. కన్నెగంటి హనుమంతుశవాన్ని మిగిలిన యిద్దరి శవాలను కోలగుట్లకు తీసుకుని వెళ్ళి 27వ తేదీన ఊరివెలుపల పూడ్చిపెట్టారు

పోలీసులు మించాలపాడు గ్రామప్రజల్ని 36 గురిని అరెస్టుచేసి తీసుకుని వెళ్ళారు. నరసరావుపేట డిప్యూటీ కలెక్టరు తప్పుడు విచారణ జరిపి కొందరికి శిక్షలు, కొందరికి జరిమానాలు విధించాడు పురుషులకు జైలుశిక్ష, స్త్రీలు, పిల్లలకు ఒక్కొక్కరికి 75 రూ॥ వంతున జరిమాన విధించబడింది.

కోలగుట్ల గ్రామానికి వెలుపల దంతెలవాగు ఒడ్డున లోకల్ ఫండ్ రోడ్డుకు సుమారు 15 గజాల దూరంలో కన్నెగంటి హనుమంతు పూడ్చిపెట్టబడిన చోట ఆయన భార్య, బంధువులు ఒక సమాధిని నిర్మించారు. హనుమంతును పోలీసులు కిరాతకంగా కాల్చిచంపిన సంఘటనను వివరిస్తూ ప్రజలు హనుమంతు సమాధిపై శిలాశాసనం ఉంచారు. దుర్మార్గులైనపోలీసులు ఆ సమాధినికూడ ధ్వంసం చేశారు.

కన్నెగంటి హనుమంతుని చంపటంలో మించాలపాడు గ్రామకరణం సదాశివరావు హస్తంకూడ ఉన్నట్లు తెలుస్తున్నది. చాలకాలంగా యీ సదాశివరావుకు హనుమంతుకు పన్నుల విషయంలో తగాదా ఏర్పడిందని, హనుమంతుని అడ్డు లేకుండా తొలగించుకోవటానికి ఫారెస్టు పోలీసు అధికార్లతో గ్రామకరణం కుట్ర పన్నాడని తెలుస్తున్నది

కన్నెగంటి హనుమంతు మించాలపాడు గ్రామంలో మోతుబరి రైతని, చుట్టుప్రక్కల పదిగ్రామాలలో అతనికి పలుకుబడి ఉండేదని, అతను కాంగ్రెస్‌పార్టీ సభ్యుడుకాదని, చుట్టుపట్ల జరుగుతున్న సహాయ నిరాకరణోద్యమప్రభావంఅతనిపై పడిందని తెలుస్తున్నది. ఏది ఏమైనా ఫారెస్టు అధికారుల; పోలీసుల దౌర్జన్యాలను దోపిడిని ఎదిరించడంలో కన్నెగంటి సాహసం ప్రదర్శించాడు. మించాలపాడుగ్రామ ప్రజలు పుల్లరికి వ్యతిరేకంగా జరిపిన పోరాటానికి నాయకత్వం వహించి నడిపించాడు ఆ పోరాటానికి ముందునిలబడి ప్రాణాలర్పించాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడి వలసపాలనకు వ్యతిరేకంగా భారత రైతాంగం అనేక సంవత్సరాలుగా జరిపిన పోరాటాలలో పల్నాటిపుల్లరి పోరాటంకూడ ఒక భాగం ఈ దృష్టితో మనం చూసినపుడు పల్నాటిపుల్లరి పోరాటంలో కన్నెగంటి హనుమంతునిర్వహించినపాత్ర మెచ్చుకోతగింది పల్నాటి పుల్లరి పోరాటానికి కొద్దిగా వెనకాముందూ చీరాల-పేరాల

ప్రజలచే పట్టణబహిష్కరణోద్యమము, పెదనందిపాడుపన్నులనిరాకరణోద్యమము జరిగాయి.

## చీరాల, పేరాల ప్రజలచే పట్టణ బహిష్కరణోద్యమము :

1919 లో చీరాల పేరాల గ్రామాల జనాభా 15 వేలు మాత్రమేఉండేది. అప్పటికి నాల్గేండ్లనుంచి అక్కడ పురపాలక సంఘాన్ని ఏర్పాటుచేయాలని ప్రభుత్వం ప్రయత్నిస్తూవచ్చింది. మునిసిపాలిటీవలన పన్నులు ఎక్కువ కావటం తప్ప ఏమీ ప్రయోజనం ఉండదని స్థానిక ప్రజలు వ్యతిరేకిస్తూ వచ్చారు బలవంతాన ప్రభుత్వం మునిసిపాలిటీ నేర్పరచింది. ప్రజలు ప్రభుత్వశాసన ధిక్కారము, చీరాల పట్టణ బహిష్కరణకార్యక్రమాలను చేపట్టారు పరమకిరాతకుడైన రూథర్‌ఫర్డు చీరాల ప్రజలపై తీవ్ర నిర్బంధాల్ని అమలు చేశాడు చీరాల వెలుపల ప్రజలు కట్టుకున్న గుడిసెల్ని రౌడీలచేత సంఘవ్యతిరేక శక్తులచేత తగుల బెట్టించాడు. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించిన దుగ్గిరాల గోపాలక్రిష్ణయ్యను అరెస్టు చేశారు. 1922 ఫిబ్రవరి దాకా 11 నెలలపాటు శాసనధిక్కారం కొనసాగించిన ప్రజలు చివరికి రామనగర్‌ను ఖాళీచేసి చీరాలలోని యథాస్థానాలకు చేరుకోవాల్సి వచ్చింది.

## పెదనందిపాడు పన్నులనిరాకరణోద్యమము :

బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని గడగడలాడించిన మరో ఉద్యమం గుంటూరు జిల్లాలో పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం. గ్రామ కరణాలు లెక్కలు వ్రాయటానికి, మునసబులు శిస్తువసూళ్ళు చేయటానికి. తలారులు శిస్తు బకాయీలను వసూలు చేయటానికి తిరస్కరించటంతో గ్రామ స్థాయి పరిపాలనా యంత్రాంగం స్తంభించిపోయింది ఈ పన్నుల నిరాకరణోద్యమంలో రైతాంగం ఉత్సాహంగాపాల్గొంది. జిల్లా కలెక్టర్, పోలీసు సూపరింటెండెంటు, సైనికాధికార్లు పెదనందిపాడు ప్రాంతంలో తిష్టవేసి ఎంత ప్రయత్నించినా పన్నులు వసూలు చేయలేకపోయారు. నిర్బంధ విధానంతో ఉద్యమాన్ని అణచటానికి రూథర్‌ఫర్డును అడిషనల్ కలెక్టరుగా ప్రభుత్వం నియమించింది. అతను రిజర్వు పోలీసుల, సైని

కుల సహాయంతో గ్రామాలపై పడి అణచివేతకుపూనుకున్నారు. రాజీనామాలు చేసిన గ్రామోద్యోగులను బరరఫ్ చేశారు వారి వంశ పారంపర్యహక్కులను రద్దుచేస్తూ ఉత్తర్వులు జారీచేశారు. శిస్తులు కట్టలేదని రైతుల ఆస్తుల్ని జపు చేశారు.అయినప్ప టికీ ప్రజలు ధైర్యంగా నిలబడ్డారు పెదనందిపాడు ఫిర్కాలో వసూలు కావలసిన 14 75 లక్షల రూ॥లు శిస్తులలో ప్రభుత్వం 3.5 లక్షల రూ॥లు శిస్తులను మాత్రమే దౌర్జన్య పద్ధతులద్వారా వసూలు చేయగలిగింది.

ప్రజలు చొరవను తమచేతుల్లోకి తీసుకుని కాంగ్రెస్‌పార్టీ అవకాశవాద, తప్పుడు నాయకత్వాన్ని కాలదన్ని ఉద్యమాలను ముందుకు తీసుకెళ్ళటంతో గిజగిజ లాడిన కాంగ్రెస్ నాయకత్వం బార్డోలీలో సమావేశమైంది. పన్నుల నిరాకరణోద్య మాన్ని ప్రస్తుత స్థాయిలో నిర్వహించటం పన్నులు చెల్లించటానికి ప్రజలు నిరా కరించడం కాంగ్రెసు తీర్మానాలకు వ్యతిరేకమని, ఈ ఉద్యమం భారతదేశంయొక్క ఉత్తమ ప్రయోజనాలకు దెబ్బఅని, పన్నుల నిరాకరణోద్యమాన్ని వెంటనే ఆపు చేయాలని ప్రజలకు ఆదేశాలు పంపింది. ప్రజల పోరాట చైతన్యాన్ని నీరుగార్చి, ప్రజాఉద్యమానికి వెన్నుపోటుపొడిచింది. కాంగ్రెసు అంటే బూర్జువా ప్రతినిధుల పార్టీ అని, బ్రిటిషు సామ్రాజ్యవాదుల ముద్దుబిడ్డఅని మరోసారి రుజువుచేసుకుంది. తర్వాతికాలంలో సహాయనిరాకరణోద్యమాన్నికాంగ్రెసుపార్టీ పూర్తిగా విరమించింది. ఆవిధంగా బ్రిటిషు పాలకుల దోపిడి యింకా ఉధృతంగా సాగటానికి తోడ్పడింది.

పల్నాటి పుల్లరిపోటాలు, చీరాల పేరాలప్రజల ఉద్యమం. పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం మొదలైనవి ప్రజాతంత్రవిప్లవంలో భాగమైనప్పటికీ బూర్జువా నాయకత్వం చేసిన ద్రోహం వల్ల బూర్జువానాయకత్వం భూస్వామ్య వర్గంతో మిలాఖత్ కావడంవల్ల భారతదేశంలో అనేక రైతాంగపోరాటాల లాగనే భూస్వామ్య విధానాన్ని, సామ్రాజ్యవాదుల దోపిడిని అంతం చేయలేకపోయాయి. బూర్జువాలు, భూస్వామ్య వర్గంతో కుమ్మక్కై కార్మిక కర్షక పోరాటాలను ప్రక్క దారిపట్టించి సామ్రాజ్యవాదుల దోపిడికి కావలికుక్కల్లావ్యవహరించారు. తత్ఫ లితంగా బ్రిటిషు సామ్రాజ్యవాదులు, తమ అధికారాన్ని భారతదేశంలోని బూర్జువా వర్గానికి దానం చేశారు. రివిజనిస్టుపార్టీనాయకులు చేసిన విద్రోహం ఫలితంగా తెలంగాణా సాయుధ రైతాంగపోరాటం దెబ్బతినింది.

పల్నాటిపుల్లరి పోరాటాలు. చీరాలపేరాల ప్రజల ఉద్యమం. పెదనంది

పాదు వన్నుల నిరాకరణోద్యమం కంటే నేడు ఆంధ్రరాష్ట్రంలో కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ యింకాయితర ప్రాంతాలలో జరుగుతున్న పోరాటాలు ఉన్నతమైనవి. ఎందుకంటే యీ పోరాటాలు మార్క్సిజం- లెనినిజం- మావోఆలోచనా విధానం వెలుగులో సాగుతున్నవి. వల్నాటిపుల్లరి పోరాటాలకు తదితర పోరాటాలకు యిలాంటి ఖచ్చితమైన శ్రామికవర్గ దృక్పథం కలిగిన సిద్ధాంత మార్గదర్శకత్వంలేదు ఈనాడు రాష్ట్రంలో జరుగుతున్న రైతాంగ పోరాటాలకుమార్క్సిజం- లెనినిజం-మావో ఆలోచనావిధానం మార్గదర్శకత్వంగా కలిగిన విప్లవకర పార్టీలు నాయకత్వం వహిస్తున్నాయి. ఆనాటి పోరాటాలు బూర్జువావర్గపార్టీ అయిన కాంగ్రెస్‌నాయకత్వంలో సాగాయి. బ్రిటిష్‌దోపిడికి రైతాంగ పోరాటాలు అంతరాయం కల్గిస్తున్నాయనుకున్నపుడు ఆపోరాటాలను కాంగ్రెస్ పార్టీప్రజలచేత విరమింపచేసింది.

దేశంలోని బూర్జువావర్గం భూస్వామ్యవర్గంతో, సామ్రాజ్యవాదులతో మిలాఖత్ కావటంవల్ల అది ప్రజాతంత్రవిప్లవానికి నాయకత్వం వహించే స్థితిలో లేకపోవటం వల్ల కార్మికవర్గ నాయకత్వంలో రైతాంగం సాయుధపోరాటంసాగించి అర్ధభూస్వామ్య, అర్ధవలసదోపిడీని అంతంచేసి నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేయాల్సిన అవశ్యకతఏర్పడింది. నూతన ప్రజాస్వామికవిప్లవంలో భాగంగా నేడు దేశంలో అనేక చోట్ల, ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రంలో కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ మొదలైన జిల్లాంలో ఇందిరా నియంతప్రభుత్వము, పోలీసులు భూస్వాములు సాగిస్తున్న పాశవికదమనకాండను, దోపిడిని ఎదిరించి రైతాంగ ఉద్యమాలు ముందుకుపోతున్నాయి.

---

# ప్రకటన

ప్ర-జ శీర్షికకు పాఠకులు ప్రశ్నలు పంపించవచ్చును. సాహిత్యం తత్వశాస్త్రం, విద్య, మతం వంటి ఉపరితల అంశాలలో దేనిని గురించి అయినా ప్రశ్నలు వెయ్యవచ్చు. ప్రశ్నల్ని ఈ క్రింది అడ్రసుకి పంపండి.

త్రిపురనేని మధుసూదనరావు
7, రామానగర్
తిరుపతి

గ్రంథ సమీక్ష

# ది టెన్స్ టైమ్

[ఆధునిక తెలుగు కవితా సంకలనం. సంపాదకుడు : వేగుంట మోహన ప్రసాద్. ప్రచురణ కర్తలు : న్యూడైరెక్షన్స్, మూడోలైను, టెక్నికల్‌నగర్, విజయవాడ 520 010, పేజీలు : 20+333. వెల: రూ 35-00, డా. 8]

తెలుగు కవిత్వానికి చాలాకాలంనుంచి ఇంగ్లీషు అనువాదాలు వెలువడుతూనే ఉన్నై. 1960 కి కొద్ది సంవత్సరాల పూర్వం అబ్బూరి వరదరాజేశ్వరరావు గారు తమకు నచ్చిన కొన్ని కవితలకు ఇంగ్లీషు అనువాదాలు ఒక పుస్తకంగా వేశారు. అంతకుపూర్వం కూడా కొన్ని అనువాదాలు వచ్చినట్లున్నై. అయితే ఇప్పటివరకూ వచ్చిన వాటిలో 'టెన్స్ టైమే' పెద్దది. భిన్న కవితా ధోరణులకు ఇందులో ప్రాతినిధ్యం దొరికింది సుమారు 200 మంది తెలుగుకవుల కవితా ఖండికల అనువాదాలు ఇందులో ఉన్నై.

'టెన్స్ టైమ్' అనే ఇంగ్లీషు పేరుకు సరిఅయిన తెలుగుపేరు పెట్టడం కష్టం మనం తెలుగు సాహిత్యంలో ఈ అర్థంలో 'కల్లోల కాలం' అని వాడతాం. కాలాన్ని వ్యాకరణంలో భూత భవిష్యద్వర్తమానాలుగా విభజించే సంప్రదాయం ఒకటుంది చాలా భాషలకు ఈ విభజన సరిపోతుంది. ఈ కాల భేదాలు భాషలో క్రియ ద్వారా వ్యక్తమైనప్పుడు దాన్ని ఇంగ్లీషులో 'టెన్స్' అంటారు మోహన ప్రసాద్ ఈ రెండర్థాలు ఉద్దేశించినట్టు పుస్తకం చూస్తే స్పష్టంగానే తెలుసుకొవచ్చు. ఈ పుస్తకంలో భూత, వర్తమాన, భవిష్యత్కాలికలుగా అనువాదాల్ని విభజించారు. Time Past, Time Present, Time Future అనే విభాగాలకి పుస్తకం పేరుతో Tense కీ ఉన్న సంబంధం తెలుస్తూనే ఉంది.

వేగుంట కవిత్వం గురించి ఖచ్చితమైన అభిప్రాయాలున్నవాడు, ఆధునికమైన అభిరుచులున్నవాడు. ఆధునికాంగ్ల సాహిత్య ధోరణులతో విశేషమైన పరిచయమున్నవాడు, కవిగా, వ్యాసకర్తగా తెలుగువారి కింతకుముందే ముందే పరిచయమైనవాడు. ఇట్లాంటి పుస్తకం వెయ్యటానికి తగిన అర్హతలున్నవాడు.

ఆయన సంకల్పం చాలా మంచిది. తెలుగు కవిత్వాన్ని ఖండాంతరాల కందించే ఈ ప్రయత్నం తప్పకుండా హర్షించదగిందే.

అయితే అలాంటి ప్రతిభావంతుడు ఈ పని చేస్తున్నాడంటే అతని దగ్గర్నుంచి కొన్ని ప్రమాణాలు, విలువలు ఆశిస్తాం. తెలుగులో 'సంపాదకుడు' అనే మాటకన్నా ఇంగ్లీషులో 'ఎడిటరు' అనే మాటకు ఎక్కువ బాధ్యతలున్నాయి. దురదృష్టవశాత్తు మోహనప్రసాదు తన బాధ్యతలను సరిగ్గా నిర్వహించలేదనే చెప్పాలి. అంతర్జాతీయ పాఠకు లాశించే ప్రమాణాల గురించి అసలు పట్టించు కున్నట్టులేదు ఇట్లాంటి పుస్తకానికి నోట్సు ఉండాలి. కేవలం భారతీయ పాఠకులకు మాత్రమే తెలిసే మాటలకు విజాతీయులకోసం వివరణ ఇయ్యాలి కవితాధోరణుల మీద విపులమైన వ్యాసం ఉండాలి. కవుల గురించి క్లుప్తమైన పరిచయముండాలి మోహనప్రసాద్ ఇట్లాంటి పనులేమీ చేయలేదు పోనీ, పద్యా లెన్నుకోటానికి పద్ధతేమన్నా ఉందా అంటే, అదీ కనపడదు. తన ప్రణాళిక ఏమిటో ఎక్కడా వివరించడు. ఉపోద్ఘాతంలో తాను బాగా చెయ్యలేకపోయ్యానని ఒప్పుకున్నారు. ఎందుకు చెయ్యలేకపోయారో చెప్పాల్సిన బాధ్యత లేదూ ? పుస్తకానికి ఉపోద్ఘాతం పేరుతో తనకున్న ప్రత్యేకమైన వివాదాస్పదమైన అభిప్రాయాలు వ్యక్తీకరించారు గాని ఇట్లాంటి సంకలనాల సంపాదకుల కవసరమైన నిగ్రహాన్ని ప్రదర్శించలేదు పుస్తకం చూస్తే ఎంతో బాగా రావాల్సిన పుస్తకాన్ని ఎందుకిట్లా చెడగొట్టారని బాధ వేస్తుంది, కోపం వస్తుంది. దీని కంతటికీ మోహనప్రసాద్ అశ్రద్ధే కారణం.

ఈ పుస్తకాన్ని తన తండ్రి కంకితమచ్చారు. దాన్ని విమర్శించే పని పెట్టుకోను. కాని అదే పేజీలో పుస్తకాన్ని శ్రీశ్రీకి Present చేస్తూ శ్రీశ్రీని 'ఆధునిక కవితాపిత'అని వర్ణించారు. ఈ పుస్తకాన్ని ఆధునిక కవితాసంకలనం'అని ప్రకటించి, పైగా 1915-1980 కాలాన్ని కూడా విశేషంగా పేర్కొని శ్రీశ్రీని 'ఆధునిక కవితాపిత' అని వర్ణించటం అసంగతంగా ఉంది. ఈ వైరుధ్యాలను కూడా చూసుకునే ఓపిక లేకుండా పోయిందా ? సంవత్సరాలు పేర్కొని 17వ శతాబ్దపు వేమనను ఇందులో ఎందుకు చేర్చారో తెలీదు. భవిష్యత్కవులుగా కొందరిని పేర్కొనటం చర్చకు తావిస్తుంది. ఇంకా కవులుగా వికసించనివాళ్ళు అనే అర్థంలో వాడి ఉండటానికి వీల్లేదు. ఎందుకంటే శ్రీశ్రీ, నగ్నముని, గద్దర్, శివసాగర్, కె. వి. రమణారెడ్డి, చెరబండరాజు, వంగపండు ప్రసాదరావు వంటి

వాళ్ళను అపరిణత కవులుగా లెక్కించటం అసాధ్యం తమ కాలంకంటే ముందున్న వాళ్ళు అనే అర్థంలో అయితే కొంతమందిని మొదటిసారి ఈ సంపుటంలోనే చూస్తున్నాము. ఈ విభాగానికి ఒక సూత్రమేమీ ఉన్నట్టు కనపడటం లేదు బలమైన సొంత అభిప్రాయాలున్న కవి మోహనప్రసాద్. 'ఆర్బిట్రరీగా' తన అభిరుచులను బట్టి చేసిన నిర్ణయాలేకాని ఇవి తార్కికంగా చేసిన నిర్ణయాలు కావు

ఈ పుస్తకానికి రాసిన ఉపోద్ఘాతం ఉపోద్ఘాతంలాగా లేదు. తనకు పూర్వం జరిగిన కృషిని చెప్పారు. బాగుంది. కాని తెలుగు కవుల మీద, విమర్శకుల మీద, స్వేచ్ఛగా, ఫ్రీస్టైల్లో వ్యాఖ్యలు చేశారు. ఇది వచనంగాలేదు. రచయితలు తమ నవలల్లో కవిత్వం రాస్తారని వ్యాఖ్యానించిన మోహనప్రసాద్ పీఠికల్లో కవిత్వం రాస్తే ఎట్లా? తెలుగులో కవిత్వం లేకుండా విషయప్రతిపాదకమైన సాధారణ వచనం రాయటం చాలామందికి చేతకాదు తెలుగువాడు ఇంగ్లీషు రాసినా కవిత్వమే రాస్తాడనే అభిప్రాయం మోహనప్రసాద్ ఈ పుస్తకానికి రాసిన పీఠిక చదివితే కలుగుతుంది. కవిత్వం పుస్తకానికి రాసిన పీఠిక కవిత్వంలాగే ఉండాలా? తెలుగు విమర్శ స్థితిమీద రచయితల సంఘాలమీద, కవులమీద సంపాదకులు చేసిన సామూహిక వ్యాఖ్యల గురించి ఏమంత పేచీ పెట్టుకో అక్కర్లేదు. తెలుగు విమర్శకులమీద విదేశ ప్రభావం ఉందన్నారు (ఉంటే ఏం పోయింది?) చాలామందిలో సమదృష్టి, విశ్వావీక్షక దృష్టి లేదన్నారు. వామపక్ష రచయితల సంఘాలు పరస్పర విరుద్ధంగా పనిచేస్తున్నాయన్నారు— వామపక్ష కవిత్వం స్వయంనాశకంగా, వ్యతిరేక ధోరణులతో ఉంది, సాధారణ మానవుణ్ని గందరగోళంలో పడేస్తుందన్నారు. వీటితో పేచీపెట్టుకోటం అనవసరం. ఈ వ్యాఖ్యకు ఆధారాలు చూపించలేదాయన. కవులకు స్వేచ్ఛ అవసరం అన్నారు. ఎవరు కాదంటారు? ప్రభుత్వ నిర్బంధాల నుద్దేశించి కాదు ఈయన చెప్పేది. వ్యక్తీకరణ స్వేచ్ఛ కాబోలు ఈయన చెపుతున్నది. పాఠకులు గ్రహించగలిగే పద్ధతిలో రాస్తే చదువుతారు. లేకపోతే చదవరు.

ఇక కవులను కొందరిని పరిచయంచేస్తూ చేసిన వ్యాఖ్యలు చాలా క్లుప్తంగా ఉండి అపార్థాలకు తావిచ్చేట్టుగా ఉన్నై. కొన్నిచోట్ల దురుసుగా ఉన్నై.

శ్రీశ్రీ తరవాత నగ్నముని యుగకర్త అని అంటారు మోహనప్రసాదు. యుగధర్మాన్ని కవులు ప్రతిఫలిస్తారు గాని యుగాల్ని వీళ్ళు నిర్మించలేరు

శ్రీశ్రీని వగ్నమునిని ఏ విషయాలకు పోలుస్తాం ? గద్దర్, శివసాగర్, పంగపండు ప్రసాదరావుల కవితాప్రాముఖ్యాన్ని ఈయన గుర్తించినట్టులేదు వరవరరావు రచయితల సంఘంకోసం కవిత్వాన్ని త్యాగం చేశాడని, రమణారెడ్డి విప్లవాన్ని గురించి పైపైన మాట్లాడే వడికి మాలిన వాళ్ళని వెనకేసుకొస్తాడని ఈయన చేసిన వ్యాఖ్యల్ని ఒప్పుకోలేం. అసలు పెద్ద లోపం ఎక్కడుందంటే, ఈ పీఠిక తెలుగు వాళ్ళని దృష్టిలో పెట్టుకొని రాసినట్టుంది. తిలక్ని, కృష్ణశాస్త్రి+శ్రీశ్రీ అంటే ఏదే శీయులకెట్లా తెలుస్తుంది ? తెలుగు కవిత్వంమీద కవులమీద తన అభిప్రాయాలు చెప్పటానికి పీఠికను ఉపయోగించుకొనే బదులు వివరణాత్మంగా ఉంటేబాగుందేది.

తెలుగు పద్యాల అనువాదాల గుణం గురించి చెప్పాలంటే ప్రతిపద్యాన్ని మూలంతో పోల్చిచూచి విమర్శించాలి. కవిత్వంలో శబ్దార్థాల పాత్ర ఉంటుంది ధ్వని సంబంధమైన లయాది గుణాలను ఇంగ్లీషులో పునస్సృష్టి చేస్తే తప్ప తీసుకురావటం కష్టం ఉదాహరణకిచూడండి.

నాకు తలంపు లేదు లలనాజనతా కబరీ భరైక భూ
షాకలనన్, నతీమృదుభుజాంతర తల్పకుచోపగూహవి
బోధకమునన్, వధూజన కపోల గళచ్ఛ్రవణావతంస హే
వాకమునన్, విలాసినుల పావట చందురు కావిపూతలన్

—వేదుల-"కాంక్ష"

I have no yearning for feminine company
To sit in their braids or glide over their necks
Find delight in softness by hugging their bosoms
And peep through the curls around their vermilion
fore heads

తెలుగు పద్యంలో "లలనా జనతా కబరీ" అనే గుర్వంత (దీర్ఘాంత) శబ్దాలవల్ల వచ్చిన సమతాగుణం, భూ/షాకలనన్, బి/బోధకమునన్, హే/వాకమునన్ అవి రెండు, మూడు, నాలుగు పాదాల ఆరంభంలో ప్రాసవల్ల వచ్చే ధ్వనిలయను నేర్పుగా ఉపయోగించుకొని చేసిన విరుపులవల్ల వచ్చిన సౌందర్యాన్ని ఇంగ్లీషులో పోగొట్టుకున్నాం.

'వీరగంధము తెచ్చినారము
వీరు దెవ్వరో దెల్పుడీ
పూసి పోదుము, మెడను వైతుము
పూల దండలు భక్తితో'

— త్రిపురనేని రామస్వామి

Come forward, or heroes and proclaim yourselves
here we have sandal paste worthy of you
that we will apply to you with love and
deck your necks with garlands of flowers.

సరి పాదాల్లో గుర్వంతత (దీర్ఘాచ్చు) వల్ల వచ్చిన అందం ఇంగ్లీషులో పోయింది అట్లాగే తెలుగులో ఉన్న సంక్షిప్తత కూడా పోయింది. ఈ రెండూ పోవటం వల్ల ఇంగ్లీషులో చప్పగా ఉంది.

అట్లాగే కృష్ణశాస్త్రిగారి "ఆకులో ఆకునై", బసవరాజు అప్పారావు గారి "చరిపిడుగా గర్జింపకు", గద్దర్ 'వోలి వోలి రంగవోలి", వంగపండు ప్రసాద రావు "యంత్రమెట్లా నడుస్తువుందంటే", శివుడి "నరుడో భాస్కరుడా" వంటి పాటలు తెలుగులో ఉన్న సౌందర్యాన్ని ఇంగ్లీషులో పోగొట్టుకున్నై అయితే అందుకు మోహన ప్రసాదు చెయ్యగల్గిందేమీలేదు. కాని అనువాదాలకు లొంగేవాటిని ఎన్నుకొని ఉంటే బాగుండేది. ఆరుద్ర శాస్త్రిగారి "వెళ్ళిపోయిం దెళిపోయింది" (The end of an epoh; P. 45) అనే గీతం తెలుగుదేశపు సంస్కృతి బద్ధమైనది విదేశీయులకు ఇది ఛస్తే అర్థంకాదు శ్రీ రంగం నారాయణబాబు గారి పద్యంలో (పే 58) రంభ, మేనక, ఇంద్రుడు, శివుడు, విష్ణువు మొదలైనవాళ్ళ ప్రస్తావన ఉంది. సుంకర సత్యనారాయణ గారి "తెలుగు బిడ్డా మే కావోయ్" (పే 75) అనే పాటలో రుద్రమ్మ, నైజాము, బందగీ, సూర్యాపేట ప్రస్తావన వస్తుంది ఇవన్నీ విదేశీయులకెట్లా తెలియాలి? తుమ్మల వెంకట్రామయ్య"చెల్లీ" అనే పాటకు సందర్భం వివరించకపోతే, దాని ప్రాముఖ్యత తెలీదు. 1948 50 ల కాలంలో ప్రభుత్వ దమన కాండకు గురైన మృతవీరుని భార్యనుద్దేశించిన పాటఇది. అట్లాగే గంగినేని 'గెరిల్లా' (పే. 80) కూడా అప్పటిదే సోమసుందర్ "ఖబడ్దార్" (పే 86) తెలంగాణా పోరాట సంబంధి. కొమరయ్య, అనంతయ్యల ప్రసక్తి కూడా ఆ పాటలో ఉంది.

అనువాదాలకు లొంగే వాటిని ఎన్నుకోవటం. సంస్కృతి బద్ధమైన వాటికి సమయ సందర్భ వివరణలియ్యటం సంపాదకుడు చెయ్యాల్సిన పనులు. ఆ బాధ్యతను వేగుంట మోహనప్రసాదు సరిగ్గా నిర్వహించలేదన్న "చేదువిషాన్ని" చెప్పక తప్పదు

అంతేకాక, కవుల పద్యాల్ని ఎన్నుకునేటప్పుడు ఆ కవుల కవితామార్గానికి ప్రాతినిధ్యం వహించేవి ఎన్నుకోవాలి నాయని సుబ్బారావుగారి "రేడియో అవ్వ" అనే పద్యం ఎన్నుకోవటంలో ఔచిత్యంలేదు,

ఇట్లాంటి పుస్తకం వేసేటప్పుడు సంపాదకుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. కనీసం తప్పులు దొర్లకుండా చూడాలి. నాయని సుబ్బారావుగారి "శుక్రవారం" అనే పద్యం (నా. సు. కృతులు పే 105) ఈ పుస్తకంలో (పే. 151) నాయని కృష్ణ కుమారి గారి రచనగా అచ్చుపడింది. ఇది సంపాదకుని అజాగ్రతకు పరాకాష్ఠ. ఉపోద్ఘాతంలో కాలక్రమ దోషాలున్నై. విరసం పుట్టింది 1970 అక్టోబరు అని రాశారు. 1970జూలైలో అనిఉండాలి. 'మార్చి' విరసం వారి ప్రచురణ అని రాశారు. అది తప్పు. విరసంకంటే ముందే 'మార్చి', 'తిరగబడు' సంకలనాలు వచ్చినై.

ఇంత అస్తవ్యస్తంగా, క్రమరహితంగా, అసంగతంగా సంపాదకుడు వ్యవహరించటం క్షంతవ్యంకాదు.

పుస్తకం గెటప్ బాగుంది. ముఖచిత్రం, భూత భవిష్యద్వర్తమానాలను సూచించే లోపలి ఫోటోలు భావగర్భితంగా ఉన్నై. ఖరీదు కొనటానికి అందుబాటులో లేదు. రాబోయే సంకలనాలకు ముడిసరుకుగా ఈ పుస్తకం ఉపయోగిస్తుంది. ఆ పని చేసినందుకైనా మోహనప్రసాద్ని అభినందించాలి. —చేరా

## స్వీకారం

1. గుండె చప్పుళ్ళు (కవితల సంపుటి) : అను రాజేంద్ర, శ్రీశ్రీ పబ్లికేషన్స్, స్టూడియో బలరాం, అమలాపురం-1. వెల రు. ఏడు.

2. తెలంగాణ పోరాట కథలు (కథా సంకలనం) : జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య, మైత్రీ బుక్‌హౌస్, లబ్బీపేట, విజయవాడ-10. వెల రు. ఆరు.

3. భూమి (కథలు) ; అల్లం రాజయ్య, 'సృజన', హనుమకొండ, వరంగల్-1. పీస్ బుక్ సెంటర్, సుల్తాన్ బజార్, హైదరాబాద్-1. వెల రు. ఏడు.

4. లయ (విప్లవయువతీఫోరమ్), కళావికేతన్ 9-1-18, వేములవాడ-2, కరీం నగర్ జిల్లా. వెల రు. మూడు.

5 భావ విప్లవకారుడు కొడవటిగంటి సాహిత్య సమాలోచన (ప్రగతి సాహితీ ప్రచురణ; ఎడిటర్- అశోక్ టంకశాల), ప్రతులకు : బి బి జి తిలక్' 102- పూర్వాంచల్, జె యన్ యు, న్యూ ఢిల్లీ-67. వెల రు. పది.

6 వ్యవస్థ - తెలుగువారి పక్షపత్రిక : ఎడిటర్ : ఆర్. ప్రశాంతరాయ్' 22-5-35 దబీర్ పూరా, హైదరాబాద్-500024.

7. రెండు నదులు (నవల) : అరుణ. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రంబిల్డింగ్స్, విజయవాడ- 520004 వెల రు. ఎనిమిది.

8. అల్లూరి సీతారామరాజు (గొల్లసుద్దులు) : టి. రామాంజనేయులు, అరుణారుణ ప్రచురణలు, వెల రు. మూడు. ప్రతులకు- స్టార్ బుక్ హౌస్, సూర్యాపేట' నల్లగొండ జిల్లా.

9. కన్నెగంటి హనుమంతు (బుర్రకథ) : టి. రామాంజనేయులు, ప్రజా నాట్యమండలి ప్రచురణ, వెల రు. 1-50.

10. చెరబండరాజు కవితలు - పాటలు : సంపాదకుడు - వరవరరావు, పీపుల్స్ బుక్స్, రమణనగర్, నవోదయకాలనీ, విజయవాడ-520010. వెల రు ఆరు

11. మృత్యుశిఖరంమీద యుద్ధఫిరంగి- హైదరాబాదు విరసంయూనిట్. వెల. రు. 1-00 (ఇవి సమీక్షకు రెండో కాపీ పంపలేదు)

12 ఆదిమకాలం నాటి సామాజిక చరిత్రే వేదములు- ప్రథమభాగం- పెండ్యాల లోకనాధం, విజ్ఞాన ప్రచురణలు, 3/17 బ్రాడీపేట, గుంటూరు-2 వెల రు 3-00

13 గోర్కీ కథలు (అనువాదం) కొమ్మారెడ్డి కేశవరెడ్డి ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు, విజయవాడ-2 వెల రు ఐదు

14 ఆధునిక సాహిత్య విమర్శ : సాంప్రదాయరీతి, డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్య, ప్రతులకు- బాలా బుక్ డిపో, స్టేషన్ రోడ్, వరంగల్లు. ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాద్. కె. అరవిందబాబు, 13-729/1 రామన్నపేట, వరంగల్-2 వెల రు నలభై.

15. గంగ్రగొడ్డలి - "ఏకైక విప్లవాత్మక పక్ష పత్రిక" : సంపాదకురాలు- లక్ష్మి గరిమెళ, రాయ్ గడ్- 765001



ప్రజాహక్కుల పరిరక్షణలో రచయితల పాత్ర గురించి 2.-6-82 న కా॥ సాగర్ అధ్యక్షతన నిజామాబాద్ విరసం యూనిట్ చర్చించింది. ప్రధాన వక్త కా॥ ఉషాయస్ డాని విరసం ఆవిర్భావానికి దోహదం చేసిన పరిస్థితులు వివరించి నేడు ఎన్‌కౌంటర్ల ముసుగులో అమానుష హత్యాకాండను కొనసాగిస్తూ పౌరహక్కులను కాలరాచివేస్తున్న ప్రభుత్వ దమన నీతిని తీవ్రంగా ఖండించారు. చర్చలో కా॥ నారాయణ కూడా పాల్గొన్నారు.

వరంగల్ యూనిట్ 30-7-82 న రావిశాస్త్రి సాహిత్య సమాలోచన సభను ఏర్పాటు చేసింది. భూతప్రేత, కుహనా వైజ్ఞానిక, కాలక్షేప సాహిత్యం వస్తున్న ఈ కాలంలో రచయితల బాధ్యతను గుర్తుచేసిన రావిశాస్త్రి సాహిత్య సమాలోచన అవసరమని డా॥ దామెర రాములు అన్నారు. "రావిశాస్త్రీయం" పుస్తకాన్ని పరిచయం చేస్తూ, రచయితలు సాహిత్య దృక్పథాన్ని, ప్రయోజనాన్ని వివేకంతో ఏర్పరచుకోవాలని రావిశాస్త్రి చెప్పారనీ, కోర్టు అనే ఉపరితలం నుండి ఈ వ్యవస్థ పునాదుల్ని ఆయన అర్థం చేసుకున్నాడనీ వరవరరావు అన్నారు. ప్రొలిటేరియట్ కావల్సిన అట్టడుగు వర్గాలను లంపెన్ ప్రొలిటేరియట్‌గా మార్చడానికి ఈ వ్యవస్థ చేస్తున్న దగుల్బాజీతనాన్ని వివరించడానికి రావిశాస్త్రి కథను పదునైన ఆయుధంగా వాడుకున్నాడని రాంమోహన రాజు చెప్పారు. రాజ్యాంగ యంత్రమనేది ఈ వ్యవస్థ చేతిలో ఒక సేఫ్టీవాల్వ్ లాగా ఉపయోగపడుతుందనే విశ్లేషణ రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తుందనీ, రాజ్యాంగ యంత్రాన్ని కూలదోసే విప్లవ వర్గాల పోరాట చరిత్ర "సొమ్ములు పోనాయండి" నవల లోనే కనిపిస్తుందనీ బాల గోపాల్ అన్నారు. మంచివాళ్ళు మంచిదారిన నడిచి ఈ కోట బురుజుల్ని కూల్చక మానరని చెప్పడానికే రావిశాస్త్రి రచనలు చేశాడని అధ్యక్షత వహించిన ఎన్. కె అన్నారు. ఈ సభ సందర్భంగా పోస్టర్లు అంటిస్తున్న నలుగురు విద్యార్థుల్ని పోలీసులు అరెస్టుచేసి ఇంత వరకు విడిచిపెట్టలేదు.

ఇదే యూనిట్ ఆగస్టు 15 న కవి సమ్మేళనాన్ని నిర్వహించింది. "నక్సల్బరీ Dare to think అని చెప్పింది. మీ ముందున్న విలువలను ప్రశ్నించకుండా తీసుకోవద్దని చెప్పింది" అని అధ్యక్షత వహించిన వరవరరావు అన్నారు.

కాంగ్రెస్ ఏర్పడకముందే దూదూమియా నాయకత్వంలో ఫరాస్ తిరుగుబాటు వచ్చిందనీ. అతను బెంగాల్‌లో నాలుగు జిల్లాంలో ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడనీ, తమకు అధికారం వస్తుందనుకున్నప్పుడే భూస్వాములుగాని, గాంధీగానీ ప్రజలపై పడు వచ్చారనీ బాలగోపాల్ అన్నారు. తర్వాత కవులు తమ కవితల్ని వినిపించారు.

విజయనగరం విరసం యూనిట్ ఆగస్టు 15 న "ఇది స్వతంత్ర దేశమా? అనే అంశంపై గోష్టి జరిపింది కా॥ గంటి ప్రసాద్ అధ్యక్షత వహించగా, చేకూరి రాజు, అప్పన్న దొర మాట్లాడారు.

ఆగస్టు 21 న నెల్లూరు జిల్లాలో జరిగిన ఇప్టూ 2వ మహాసభల్లో హెచ్చార్కె విరసం తరపున సందేశమిచ్చారు ప్రస్తుత ఆర్థిక రాజకీయ సంక్షోభం సాంస్కృతిక రంగంలో కూడా ప్రతిబింబిస్తుందనీ, ఈ కుళ్ళు సంస్కృతికి వ్యతిరేకంగా విరసం పోరాడుతుందనీ, నూతన ప్రజాతంత్ర భారతదేశాన్ని నిర్మించడంలో కార్మికులతో పాటు విరసం చేయిచేయి కలిపి నడుస్తుందనీ హెచ్చార్కె అన్నారు.

యూనియన్ సైన్యాలు 13 9-1948 న తెలంగాణాలో ప్రవేశించిన బ్లాక్ డే సందర్భంగా "తెలంగాణా పోరాటం – తెలుగు సాహిత్యం"పై హైద్రాబాద్ యూనిట్ 12-9-82న చర్చా గోష్ఠిని నిర్వహించింది. తెలంగాణా పోరాటం కొనసాగింపే నక్సల్బరీ అని, తెలంగాణా పోరాట సాహిత్యంలోని విప్లవసారం కొనసాగింపే నేటి విప్లవ సాహిత్యమనీ సభకు అధ్యక్షత వహించిన కా॥ జయ అన్నారు. కా॥ నవీన్ (జనసాహితి) తెలంగాణా పోరాట కథల్ని గూర్చి వివరించారు. జయధీర్ తిరుమలరావు ప్రజల్లో పాటకున్న ఆదరణను వివరిస్తూ, పోరాట కాలంలో పాట ఆయుధంగా ఉపయోగపడిందన్నారు కా॥ హెచ్చార్కె కవిత్వం, కథలు మొదలయిన సాహిత్య ప్రక్రియల్లో విరసం చేస్తున్నటువంటి కృషిని వివరించారు పిసిశెట్టి వెంకటేశ్వరరావు పోరాటకాలంలో తమ అనుభవాల్ని చెప్పారు. బీహార్ ప్రెస్‌బిల్లును ఖండిస్తూ విరసం చేసిన తీర్మానాన్ని సభ ఆమోదించింది.

సాహిత్యంలో ప్రజాపంథా అనే అంశంమీద 19-9-82న వరంగల్ విరసం యూనిట్ చర్చా గోష్ఠిని నిర్వహించింది. శ్రామికుల కోసం రాయాలని ఏనాన్ ఫోరంలో చైర్మన్ మావో చెప్పిన మాటల్ని మావో వర్ధంతి (సెప్టెంబర్ 9)

ని దృష్టిలో పెట్టుకొని దామెర్ల రాములు మాట్లాడారు. శ్రామిక పంథా, కార్మికపంథా అని గాకుండా ప్రజాపంథా అని అనటం మావో నుంచే మొదలయిందని, చైనాలో అర్థ వలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థ ఉన్నందున నూతన ప్రజాస్వామిక విప్లవం కోసం సాహిత్యంలో ప్రజాపంథా మావో ప్రవేశపెట్టాడని బాలగోపాల్ వివరించారు. వరవరరావు తెలంగాణా పోరాట సాహిత్యం గురించి మాట్లాడారు. రావి నారాయణ రెడ్డి, సుందరయ్యలు వ్రాసిన పుస్తకాల్లో తమతమ 'Models' లో తెలంగాణాని ఇరికించడానికి ప్రయత్నించారనీ, కమ్యూనిస్టు పార్టీ విభజన తర్వాత వచ్చిన నవలలు biasedగా ఉన్నాయని, దాశరథి, ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి, కాళోజీ, గంగినేని మొదలయిన కవులు పోలీస్ యాక్షన్‌ని సమర్థించారనీ, ఈ పోరాటానికి వ్యతిరేకులయిన ఆర్యసమాజ్, ఆర్. యస్. యస్. లు ఇది ముస్లింలకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంగా ప్రచారం చేసాయనీ, వాస్తవానికి ఇది పాలకులకు వ్యతిరేకంగా పాలితులు సాగించిన మహత్తర పోరాటమని చెప్పారు.

## చెరబండ రాజు స్మృతిలో ... .... ...

సంతాప ప్రకటనలూ, సంతాపసభల చర్చా గోష్ఠుల రిపోర్టులూ ఇంకా వస్తూనే ఉన్నాయి.

ప్రొద్దుటూరు విప్లవ రచయితల, సాహితీ మిత్రుల ఆధ్వర్యంలో జూలై 11 న చెరబండరాజు సంతాపసభ జరిగింది. పట్టణ మున్సిపల్ ఛైర్మన్ ఐ. సుబ్బారెడ్డి అధ్యక్షత వహిస్తూ, చదువురాని వారికి కూడా అర్థమయ్యేలా విప్లవ సాహిత్య సృష్టి చేసిన కవి చెరబండ రాజు అని అన్నారు. మార్క్సిజం- లెనినిజం- మావో ఆలోచనా విధానంతో ఆయన కవిత్వం వ్రాశారని మల్లేనారాయణ అన్నారు. ప్రభుత్వాన్నెదిరించి, కష్టాల నెదుర్కొంటూ నమ్మిన సిద్ధాంతాన్ని గట్టిగా చెప్పాడని కె. సుబ్బారెడ్డి అన్నారు. చెరబండ రాజు ఒక వ్యక్తికాదు, ఒక సంస్థ అని కె. పద్మనాభరెడ్డి చెప్పారు. చెరబండ రాజుకు జోహార్లు అర్పించడమంటే ఆయన ఆశయాన్ని ఆచరణలో అమలు పర్చడమేనని డి. బాలమునిరెడ్డి అన్నారు

జనతా ప్రజాతంత్ర యువజన సమాఖ్య 4-7-82న చెర సంస్మరణసభ జరిపింది. కా॥ జి. యన్. కృష్ణమూర్తి అధ్యక్షులు. ఈ సభలో వివిధ ప్రజా సంఘాలవారు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

ఖదివేదిలో జూలై 16న రాడికల్స్ చెర సంస్మరణసభ జరిపారు. ఒక వైపున రాడికల్స్‌కోసం పోలీసుల వేట మరోవైపునవర్షం. అయినా జనం కాగడాల ఊరేగింపుతో చెరబండరాజుకు జోహార్లర్పించారు. కా॥ వరవరరావు, కా॥ బాలగోపాల్ ప్రసంగించారు.

సమావేశస్థలంకూడా దొరకని తీవ్ర నిర్బంధ పరిస్థితుల్లో 18-7-82న వరంగల్ విరసం యూనిట్ జరిపిన చెర సంస్మరణసభకు వందలాదిగా అభిమానులు హాజరయ్యారు. తనపాట ద్వారా, మాటద్వారా, చిత్తశుద్ధితో కూడిన ఆచరణద్వారా విప్లవోద్యమానికి, ప్రజాస్వామిక పౌరహక్కుల ఉద్యమాలకూ చెర అందించిన సహకారాన్ని మర్చిపోలేమని అధ్యక్షత వహించిన వరవరరావు అన్నారు. చివరి దాకా చెర ప్రదర్శించిన మొక్కవోని చేవ గురించి దామెర వివరించారు. డా॥ అమ్జద్అలి చెరను 'విప్లవ శిశువు' గా భావిస్తూ ఉర్దూలో కవిత చదివారు. అల్లం వీరయ్య. రాములు, మురళీధర్ మొదలైనవారు చెరపై కవితలు చదివారు చెరనవల 'ప్రస్థానం' గురించి గంగాధర్ ప్రసంగించారు. చెరలక్ష్యాన్ని నెరవేర్చడమే ఆయన సంస్మరణ అని బాలగోపాల్ అన్నారు. వరంగల్, హన్మకొండ పట్టణాలలో చెర బొమ్మతో, కవితాచరణాలతో అచ్చయిన పోస్టర్లు వెల్లివిరిశాయి.

కావలిలోని చెరబండరాజు స్మారక కమిటీ 18-7-82 న పెద్దయెత్తున చెరసంస్మరణ జరిపింది. త్రిపురనేని మధుసూదనరావు, కొత్తపల్లి రవిబాబు ప్రసంగించారు. ఆరోజు మధ్యాహ్నం మధుసూదనరావుగారు సాహిత్యం -శాస్త్రీయ దృక్పథం గురించి ఉపన్యసించారు.

నిజామాబాద్ విరసం యూనిట్ 1-8-82 న కా॥ సి. హెచ్. మధు అధ్యక్షతన చెర సాహితీ సమాలోచన జరిపింది. బి. యన్. బి. చదివిన 'అన్నా చెరబండరాజు' అన్న గేయంతో సభ ప్రారంభమైంది. కా॥ నారాయణ చెర వ్యక్తిత్వాన్ని గురించీ కా॥ సాగర్ చెరకవిత్వాన్ని గురించీ ఉపన్యసించారు. మధు చెర నవలల్ని సమీక్షించారు

నెల్లూరు జిల్లా విరసం యూనిట్ నెల్లూరులో జరిపిన చెరసంస్మరణసభకు టి కోటయ్య అధ్యక్షత వహించారు కె. వి రమణారెడ్డి చెర జీవిత, సాహిత్యాల్ని గురించి ప్రసంగించారు. దిగంబర కవిగా ఉన్నప్పుడే స్పష్టమయిన

మార్క్సిస్టు దృక్పథంతో చెరబండరాజు కవిత్వం రాశాడని వి. చెంచయ్యఅన్నారు ఇదే యూనిట్ 8-8-82 న వెంకటగిరిలో జరిపినసభకు వి. చెంచయ్య అధ్యక్షత వహించగా త్రిపురనేని మధుసూదన రావు 'రావిశాస్త్రీయం' పుస్తకాన్ని పరిచయం చేశారు. ఉషాయస్‌డానీ నెల్లూరు విరసం యూనిట్ ప్రచురించిన మధుసూదనరావు 'గతితార్కిక భౌతిక మానవతా వాదం' పుస్తకాన్ని పరిచయం చేశారు.

ప్రభంజన సాహితీ సమాఖ్య [అలకూరపాడు] 11-9-82 న జరిపిన చెర సంస్మరణ సభలో వి చెంచయ్య, కళ్యాణరావులు ప్రసంగించారు అరెస్టులకూ ప్రభుత్వపు బెదిరింపులకూ లొంగక విప్లవ చేతతో విప్లవ సాహిత్యాన్ని సృష్టించిన కవి చెరబండరాజని వి చెంచయ్య అన్నారు.

జిల్లా విరసం పక్షాన గద్వాలలో 12-9-82 న చెర సాహిత్యంపై గోష్ఠి జరిగింది. జిల్లాలోని విరసం సభ్యులందరూ ఈ సభలో పాల్గొన్నారు. అంపశ్రీ అధ్యక్షత వహించారు. రేడియం, రాంమోహన్, రాజేంద్రబాబులు ప్రసంగించారు విద్యార్థి నాయకులు సుదర్శన్‌రెడ్డి,హనుమంతరావు, రమణయ్యకూడాఉపన్యసించారు విరసం పక్షాన జరిగిన సభ చెరబండరాజు సంతాపసూచకంగా గాక, ఆత్మశాంతి కోసం మౌనం పాటించడం ఆశ్చర్యకరంగా ఉంది.

"శ్రామిక జనం కోసం, శ్రామిక సంస్కృతికోసం నిర్భయంగా పోరాడిన విప్లవకవి చెరబండరాజు మరణవార్త మాకెంతో బాధను కలిగించింది. మా దగ్గరి బంధువు పోయినట్టుగా మాకనిపించింది. పీడిత ప్రజల అభ్యున్నతికి ఆయన పాటుబడ్డాడనడంలో సందేహంలేదు ఆయన కుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాం " అంటూ పశ్చిమబెంగాల్ నుండి విప్లవ రచయితల సంఘం దుర్గాపూర్ యూనిట్ తన సంతాప ప్రకటనను పంపింది.

పశ్చిమ బెంగాల్‌నుండే అసన్సోల్ ఇండస్ట్రియల్ కాంప్లెక్స్‌కు చెందిన రచయితలూ, కళాకారులూ, మేధావులూకూడా చెరసంతాపసభ జరిపారు చెర రచనల వల్ల తాము చైతన్యంపొందామని, ఇంకా పొందుతామనీ పేర్కొన్నారు. చెర కుటుంబానికి సంతాపాన్ని తెలిపారు.

చెరబండరాజు పోయినందుకు కన్నీరు కారుస్తూ కూర్చోక వారి స్మృతులతో ముందుకు సాగుతామని, భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతులకు వ్యతి

రేకంగా చెర పోరాటాన్ని కొనసాగిస్తామని అంటూ తమిళనాడు నుండి పీపుల్స్ ఆర్ట్ అండ్ లిటరరీ అసోసియేషన్ మద్రాసు, తంజావూరు, మదురై యూనిట్లు చెరబండరాజుకు విప్లవ శ్రద్ధాంజలి ఘటించారు

అశేష ప్రజానీకపు గుండె చప్పుళ్ళను తన గుండెధైర్యంతో వినిపించిన ప్రముఖ విప్లవకవి చెరబండరాజు మృతికి ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ రణస్థలం సమితిశాఖ ప్రగాఢ సంతాపాన్ని ప్రకటించింది

ప్రజా సాహిత్యోద్యమానికి చెరబండరాజు చేసిన కృషిని రణస్థలం జన సేవా యువ సంఘం ప్రశంసిస్తూ ఆయన మరణానికి సంతాపాన్ని వ్యక్తం చేసింది.

"పోరాటం డైరక్షన్‌తో" అన్న పేరుతో మహబూబ్‌నగర్ విరసం యూనిట్ చెరపాటలు కొన్నిటిని పునర్ముద్రించింది.

## చిత్తూరు జిల్లా విరసం యూనిట్ విశేషాలు

తిరుపతిలో, చిత్తూరులో, నగరిలో చెరబండరాజు సంతాపసభలుజరిగాయి శిల్పి, సంపత్, థామస్, పి.సి నరసింహారెడ్డి, మనిసుందరం, భాస్కరచౌదరి, రెడ్డప్ప, నగరి విద్యార్థి సంఘ అధ్యక్షుడు, వి ర.సం. కార్యదర్శి మధుసూదనరావు ఈ సభలలో ప్రసంగించారు.

చెరబండరాజు నూతన ప్రజాస్వామికవిప్లవ సాంస్కృతిక సైనికుడు. నగరంలో జీవించినా గ్రామీణజీవిత మూలాలు ఆయన కవిత్వంలోనూ, వ్యక్తిత్వం లోనూ ఉన్నాయి. మార్క్సిజం-లెనినిజం, మావో ఆలోచనా విధానం రైతాంగ పోరాటాలలో జీవిత రూపాన్ని పొంది చెరకవిత్వంలో అనువదింపబడింది నక్సల్ బరీ, శ్రీకాకుళ రైతాంగ పోరాటాలే చెరకవిత్వానికి ప్రాణవాయువులు. పాటని శక్తి వంతమైన విప్లవ ఆయుధంగా ప్రయోగించాడు. వచన కవిత్వం, నవల, కథానిక, నాటికవంటి అనేక ప్రక్రియల్ని విప్లవీకరించాడు. తన జీవితాన్ని కవిత్వాన్నీ ప్రజా పోరాటాలకి అంకితం చేశాడు. పార్టీరచయిత గొప్ప సాహిత్యం సృష్టించలేడని ఇటీవల కొంతమంది పెటీ బూర్జువా రచయితలు పెద్దదుమారం లేపారు. ఇలాంటి

వికృత రచయితలకి చెరబండరాజు సాహిత్యం తిరుగులేని సమాధానం. విప్లవ రచయితల సంఘంనుంచీ, మార్క్సిస్టు- లెనినిస్టు పార్టీ (పీపుల్స్‌వార్)నుంచీ, రైతాంగ పోరాటాలనుంచీ చెర జీవితాన్ని, సాహిత్యాన్ని విడదీసి పరిశీలించటానికి వీలులేదు. చెరబండరాజుని దిగంబర కవిత్వవలయంలో బిగించటానికి అవతారాలు వెనక్కి ముందుకి వెనక్కి మార్చిన మాజీ దిగంబర కవులూ వాళ్ళ దురభిమానులూ ప్రయత్నిస్తున్నారు. చెర దిగంబర కవిగా కూడా పీడితప్రజలపక్షపాత కవిత్వమే రాసాడు దిగంబర కవిత్వాన్ని విసర్జించి తర్వాత తిరిగి దానిపేరుకూడా స్మరించలేదు.

ఇది ఈ సభలలో ఉపన్యాసకుల సారాంశం. సభలకి విద్యార్థులూ, రచయితలూ, మేధావులూ. రైతులూ వందల సంఖ్యలో పాల్గొన్నారు.

30-7-82 న 'రావిశాస్త్రీయం' గ్రంధావిష్కరణసభ జరిగింది. పి. సి. నరసింహారెడ్డి, భూమన్, వల్లంపాటి వెంకటసుబ్బయ్య, మధుసూదనరావులు రావిశాస్త్రి సాహిత్యాన్ని గురించిప్రసంగించారు. రావిశాస్త్రిసాహిత్యంలో కార్మికరైతాంగ వర్గాలకంటే అలగాజనం ఎక్కువగా కనిపిస్తారనీ, అలగాజనం విప్లవ వర్గం కాదనీ అందుకని రావిశాస్త్రి సాహిత్యాన్ని లోతుగా పరిశీలించవలసిన అవసరం ఉందనీ భూమన్ అభిప్రాయపడ్డాడు రావిశాస్త్రి నవలకంటే కథలు గొప్పవనీఅల్పజీవి నవలలో ఆత్మన్యూనతా భావాన్ని చిత్రించారనీ కొన్నితప్పులు చేసినా రావిశాస్త్రి గొప్ప రచయిత అని వెంకటసుబ్బయ్య ప్రసంగించారు. రావిశాస్త్రి సాహిత్యంలోని వామపక్షభావాల్ని గురించీ, బాకీఇదల్లో సొమ్ములు పోనాయండిలోని విప్లవభావాల్నిగురించీ వస్తుశిల్పాలఅయిక్యతని గురించీ మధుసూదనరావు వివరించాడు. సభకి శిల్పి అధ్యక్షత వహించాడు. పి. సి. ఎన్. రావిశాస్త్రీయాన్ని ఆవిష్కరించారు.

14-9-82 న హైద్రాబాద్‌లో విరసం కార్యవర్గం చేసిన

# తీర్మానాలు

## "పత్రికా స్వేచ్ఛ మీద ప్రభుత్వ కరాళహస్తం"

భారతదేశ ప్రభుత్వం అంటే అణిచివేతకి మారుపేరు. సామ్రాజ్యవాదులు జాతీయోద్యమ ప్రారంభదశలోనే పత్రికాస్వేచ్ఛమీద తీవ్రమైన ఆంక్షలు

విధించేవారు పత్రికల సంచికల్ని నిషేధించడం, పత్రికా సంపాదకుల్ని అరెస్టు చెయ్యడం, పత్రికల్లో తమకి వ్యతిరేకంగా రాసిన వాళ్ళని జైల్లో పెట్టడం బ్రిటీషు సామ్రాజ్యవాదులు కొనసాగించిన పద్ధతి. ఈ సామ్రాజ్యవాద విధానాల్ని 1947 నుంచీ ఈనాటివరకూ భారత ప్రభుత్వం కొనసాగిస్తున్నది. బీహార్ ప్రెస్ బిల్లు ఈ అణిచివేతకి పరాకాష్ఠరూపం. ఈ బిల్లుకి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న పాత్రికేయులకీ, పత్రికాసిబ్బందికీ, మేధావులకీ, విద్యార్థి, యువజనులకీ విప్లవ రచయితలసంఘం అభినందనలు తెలియచేస్తోంది.

పత్రికాస్వేచ్ఛ అంటే రాజకీయ స్వేచ్ఛ. రాజకీయ స్వేచ్ఛకోసం చేసే పోరాటంలో పత్రికాస్వేచ్ఛకోసం చేసే పోరాటం ఒకభాగం. ఈ సందర్భంలో పత్రికల యజమానులూ సంపాదకులూ మొదలైన జర్నలిస్టులూ ఒక ప్రధానమైన విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి పత్రికా స్వేచ్ఛ అంటే పత్రికల సొంతదారుల, స్వేచ్ఛకాదు సమాజస్వేచ్ఛ. సమాజంలో సంఘర్షణ పడుతున్న అన్నిశక్తులకీ, భావాలకీ పత్రికలు అద్దం పట్టాలి. దేశంలోని విప్లవోద్యమాన్ని గురించి, ప్రజల విప్లవ పోరాటాల్ని గురించీ పత్రికలు పాక్షికంగా వ్యవహరిస్తాయి. విప్లవ రచయితల సంఘం. విప్లవ విద్యార్థి యువజనసంఘాల సభల్ని గురించీ, కృషిని గురించీ పత్రికలు వార్తలు వెయ్యడంలేదు.

వాస్తవమైన పత్రికా స్వేచ్ఛకోసం పోరాటం చెయ్యవలసిందిగా మేధావుల్నీ, రచయితల్నీ, పాత్రికేయుల్నీ కోరుతున్నాం. వర్గపోరాటంలో భాగం కాకుండా స్వేచ్ఛకోసం చేసే పోరాటం విజయవంతం కాదని గుర్తుచేస్తున్నాం.

## "ఎదురుకాల్పుల" వ్యతిరేక ఆందోళనకు సంఘీభావం

పరిశా కార్యకర్తలను, రాజకీయ ప్రత్యర్థులను పట్టుకొని కాల్చివేసి "ఎదురుకాల్పుల్లో" మరణించారని ప్రకటిస్తున్నది ప్రభుత్వం. ఆంధ్రప్రదేశ్‌లో "నక్సలైట్ల" పేరుతో, ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో "బందిపోట్ల" పేరుతో పోలీసులు ఈ మారణకాండ సాగిస్తున్నారు.

వరంగల్, నల్గొండ జిల్లాలలో "ఉగ్రవాద" ఉద్యమాన్ని అణచివేయ డానికి అదనపు బలగాలను పంపించాలని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ ఉత్తరప్రదేశ్

బీహార్‌లలో "సాంఘిక వ్యతిరేక" శక్తులను అణచివేయడానికి చేయడానికి చట్టాన్ని ఇక్కడకూడ వర్తింపచేయాలని ప్రభుత్వం తన ఆలోచనగా ప్రకటించింది.

"ఎదురుకాల్పుల" పేరిట ప్రభుత్వ హత్యాకాండకు వ్యతిరేకంగా ఆంధ్ర ప్రదేశ్ పౌరహక్కుల సంఘం చొరవతో "ఎదురుకాల్పుల వ్యతిరేక కమిటీ" నిర్వహించిన ప్రదర్శనలను ఆందోళనను సమర్థిస్తూ విరసం తన సంఘీభావాన్ని ప్రకటిస్తున్నది.

## లెబనాన్ మీద ఇజ్రాయిల్ దుర్మార్గయుద్ధం

స్వతంత్ర పాలస్తీనియన్ రిపబ్లిక్ స్థాపనకు ప్రతికూలంగా గత ఇరవై యేళ్ళనుంచి ఇజ్రాయిల్ దురాక్రమణ యుద్ధాలు చేస్తూవచ్చింది లెబనాన్‌లో నివసిస్తూన్న పాలస్తీనియన్ ప్రజలను నిర్మూలించేందుకు ఇజ్రాయిల్ లెబనాన్‌మీద దారుణమైన బీభత్సకాండను జరిపింది. ఐరాస తీర్మానాలను ఏమీ ఖాతరు చెయ్యకుండా, అమెరికన్ సామ్రాజ్యవాదుల మద్దతుతోటి ఇజ్రాయిల్ యుద్ధోన్మాదులు జెరూసలేం నగరాన్ని, వెస్ట్‌బ్యాంక్ ప్రాంతాన్ని ఆక్రమించాలనుకుంటున్నారు. అరబ్ రాజ్యాలుకూడా పైపైకి పాలస్తీనియన్లను సమర్థిస్తున్నా, తమతమ దేశాలలో భూస్వామిక, సైనిక, దోపిడీ ప్రభుత్వాలు కుప్పగూలిపోతాయనే భయంతో ఆచరణలో ఉదాసీనత చూపారు. ఈ సమస్యలో సోషల్ సామ్రాజ్యవాదులు కూడా కపటంగా వ్యవహరిస్తూ, వట్టి బెదిరింపులతో ఇజ్రాయిల్ దురాక్రమణను ఖండిస్తున్నారు. అరబ్ రాజ్యాలలో కొన్నిటిని తమ తొత్తులుగా చేసుకుని ఈ ప్రాంతంలో అమెరికన్ సామ్రాజ్యవాదులతో ఆధిపత్యంకోసం పోటీ పడుతున్నారు. ఇలా నలువైపులనుంచి వంచనవల్ల ఎన్నో కష్టనష్టాలకు గురై, లెబనాన్ దేశాన్ని వదిలిపోవలసి వచ్చిన పాలస్తీనియన్ విమోచన సంస్థ సభ్యులపట్ల పీడిత ప్రపంచ ప్రజలంతా సంఘీభావం ప్రకటించాలని విరసం కార్యవర్గం కోరుతుంది

## చెర కుటుంబ సహాయ నిధి

వి. వి. అప్పారావు, విజయవాడ, 100 రూ, సిరిక్‌చంద్రన్, ఉరుచూరు, 500 రూ, ఆంధ్రజ్యోతి వారపత్రిక వసూళ్ళు, 69రూ, దేవవ్రత పాండ,

కలకత్తా, 347 రూ, కర్నూలు హెడ్‌పోస్టాఫీస్ మిత్రుల వసూళ్ళు, 131 రూ. సమరసేన్, కలకత్తా (చెక్), 105 రూ ఎం. పి ఆర్. రెడ్డి. కావలి (చెక్) 30రూ రాడికల్ విద్యార్థి సంఘం, కడప, రు 56-75 పై, డా॥ మల్లారెడ్డి, హైదరాబాద్, (చెక్) 100 రూ, ఏ. వి, యస్ శాతకర్ణి, మధ్యప్రదేశ్, 50 రూ భారత హేతువాద సంఘసభ్యులు పి. భీమన్న చేసిన వసూళ్లు : 395 రూ. (జి పుల్లేశ్వరరావు, 100 రూ, పి భీమన్న, 100 రూ., ఎం. విజయకుమార్ 50 రూ, కె నాగేశ్వర రావు; 50 రూ , ఎన్. వెంకట్రావు, 25 రూ , ఎస్ ఎస్ చలం, 25 రూ , కె. సుబ్రహ్మణ్యం, 25 రూ., ఎం. రంగారావు, 20 రూ,) ఏ.వి బాలసుబ్రహ్మణ్యం ధావనగిరి. 25 రూ., ఎన్.ఎన్. ఎస్ ఎం ఎం.రావు. బొంబే. 10 రూ , గుం టూరులో చెరబండరాజు సంతాపసభలో వసూళ్ళు. 134 రూ, ఉమాపదద్యాజ్యమిల్క్ పశ్చిమబెంగాల్, 50 రూ, ఒక వెస్ట్‌బెంగాల్ మిత్రుడు, (చెక్) 50 రూ., కృష్ణరాజ్, ఇ. పి. డబ్ల్యు, ఎడిటర్, (డి డి.), 50 రూ పి. గుహాధాకుర్ధా కలకత్తా (చెక్), 35 రూ , ఆర్. ఎం ఎస్. స్టాఫ్, కర్నూలు, 2 రూ , వై ఎత్తిరాజ్, దుగ్గిరాల, 15రూ , పోస్టల్‌డిపార్టుమెంట్, కర్నూలు, 36రూ , వి నరసింహారావు, వాగన్ వర్క్‌షాపు 20రూ, దమ్మపేట Z. P హైస్కూలు, H M. & స్టాఫ్, 105 రూ, మద్దంశెట్టి హనుమంతరావు, పశ్చిమ బెంగాల్, 10రూ , దుష్యంతన్, మద్రాసు 10 రూ , పి. వి భక్తవత్సలం, తిరుపత్తూరు; 25రూ., డా॥ చక్రధారి, వరంగల్, 100 రూ, ఎం ఎం రహమాన్, న్యూఢిల్లీ, 20 రూ, జి. ఎం. ఎ. ఎన్. రెడ్డి. బెంగుళూరు, 30రూ, కె. ఆర్ రాజారెడ్డి, మనిలా, కరీంనగర్‌జిల్లా, రు. 150, (యం వో ) కె సుధాకర్, మత్తల్ రు. 55 (డ్రాఫ్ట్) యస్ వి. రమణారెడ్డి. కావలి రు. 5/-, రవీంద్రబాబు, కావలి, రు. 5/-, రత్నావళి. కావలి, రు. 5/-, జయరావు. కావలి, రు. 5/-, షణ్ముగం, కావలి రు. 5/-, వెంకటేశ్వర్లు. కావలి. రు 5/-, వెంకయ్య కావలి, రు 5/-, క్రాంతిరాజన్. కావలి. రు. 10/-, వేమయ్య కావలి, రు. 5/- అభిమానులు, మాచర్ల, రు. 200/- (డ్రాఫ్ట్).

తుంబా మిత్రులు, కేరళ, రూ. 500, కాకతీయ మెడికల్ కాలేజి, వరంగల్. రూ 230, కాకతీయ మెడికల్ కాలేజి నుండి, వెంకటేశ్వర్లు రూ 50. డా తిరుపతయ్య రూ 10, డా. బాలరాజు, రూ 15, డా. రఘురామరావు రు. 25 డా. పి. క్రాంతిరావు రు 25, డా ఎ. లక్ష్మినారాయణ, రు 15, డా. కె కృష్ణ

రెడ్డి, రు 15 డా. జ్ఞానేశ్వర్ రూ 10, కాకతీయ మెడికల్ కాలేజీ రాడికల్స్ ఏర్పాటుచేసిన చెరసంస్మరణసభలో వసూళ్ళు రూ 86-45, పి. లక్ష్మినారాయణ, వరంగల్ రు 50, వై. చక్రపాణి ఖమ్మం, రు. 30, కాకతీయ యూనివర్సిటీ కాంపస్ కాలేజీ. వరంగల్ నుండి డా, శ్రీనివాసరెడ్డి, రు 200 డా సి. హెచ్. బలరాముడు, రు 200, డా. కె వి రామకోటిశాస్త్రి రు50, పి రాంసుందర్, రు.50, టి. వి. నారాయణ ద్వారా నర్సరావుపేట అభిమాని రు 10, మరొక అభిమాని, రు 5, వరంగల్ విరసంసభ్యుడు ఉపాధ్యాయద్వారా, డా. వి. తిరుపతయ్య రు 5, సత్యం, రూ 5, ఎస్. ఆర్. స్వామి రు. 5, జి నర్సయ్య, రు 5 జి సత్తయ్య, రు 5 బి. దిగంబరరావు, రు. 5, రామేశ్వర్, రు 10, ఎస్ సాంబయ్య, రు5, సుధాకర్, రు 10, యమ్. బలయ్య రు 5 వరంగల్ విరసం యూనిట్ జరిపిన చెరసంస్మరణసభలో వసూళ్ళు, రు 119.05, బాలగోపాల్ద్వారా కాకతీయ యూనివర్శిటీ నుండి, ప్రొఫెసర్ శంకరయ్య రు. 50, డా. పి శివరామకృష్ణారావు రు 100. డా. ఎ జగన్మోహనాచారి రు 100, వెంకటేశ్వర్లు రు, 100, ఎన్. లింగమూర్తి, రు 150, ఒ. ఘనశ్యాందాస్ రు. 50, ఎస్. ఎస్. వి. ఎన్. శర్మ రు 50, నరసింహమూర్తి రు 25, సిద్దోజ్‌బాబూ, రు 5, శ్రీమతి విద్యారాణి రు 100.

## చెరబండరాజు వందన సమర్పణ

ఒక్కచోట ప్రభుత్వం విఫలమైతే ప్రజలు మేల్కొంటారు.

ఒకచోట ప్రజలు మేల్కొంటే, ప్రభుత్వం పతనమై, భూస్థాపితమవుతుంది.

ఆర్మీ, ఆయుధాలు, పోలీసువ్యవస్థలాంటి హంతక సంస్థలు.

అబద్ధాన్ని అందంగా ప్రచారంచేసే వందిమాగధులైన రచయితల్ని పదవుల్తో, డబ్బుసంచుల్తో, పట్టుశాలువాలతో కొనుక్కొని ప్రజలమీదికి ఎక్కుపెడితే, ప్రజారచయితలైన విప్లవరచయితల్ని కుట్రలూ కుహకాల్తో అక్రమకేసుల్లో ఇరికించి, లాఠీ తూటాల్తో హింసించి, వాళ్ళ రచనల్ని నిషేధించి అవకాశం దొరికితే పొట్టనపెట్టుకునే ఆలోచనల్తో వుంటోంది దోపిడీ ప్రభుత్వం. కాని ప్రజలు తమ రచయితల్ని కళాకారుల్ని రక్షించుకుంటారు

చిరకాలంగా, నిర్బంధానికి నిరుద్యోగానికి గురవుతో విరసం సభ్యుడిగా కొనసాగుతూ, రెండుసార్లు మేజర్ బ్రెయిన్‌ట్యూమర్ ఆపరేషన్లతో నా భవిష్యత్తు వేళ్ళమీద నెలలు లెక్కించేంత హీనస్థితికి దిగజారిపోయి అంపశయ్యమీదున్న నా అనారోగ్య విషమస్థితిని తీవ్రసమస్యగా భావించింది. బాధ్యతనెరిగినవిరసం సహాయ నిధికి పిలుపునిచ్చింది.

నిర్బంధానికి నిరుద్యోగానికి గురి అవుతోన్న విప్లవ రచయితల సంఖ్య విరసంలో నానాటికి పెరుగుతూనేవుంది వారిలో నేనూ ఒకణ్ని, '80 మే 18తో సస్పెన్షన్ ఏడో ఏట అడుగుపెట్టాను.

రెండుసార్లు మేజర్ బ్రెయిన్ ట్యూమర్ ఆపరేషన్లతో వేళ్ళమీదనెలలు లెక్కించేంత హీనస్థితికి దిగజారిపోయి అంపశయ్య మీదున్న నాఅనారోగ్యపరిస్థితిని తీవ్రమైన సమస్యగా భావించిన విరసం నా భార్యాబిడ్డల భవిష్యత్తుకు ఆందోళన చెంది తన నైతిక బాధ్యతగా గుర్తించి నా సహాయ నిధికి పిలుపిచ్చింది. ఎందరి పేర్లని చెప్పగలను ? .. ....

---

## జననాట్యమండలి గురించి ..........

ప్రజా పోరాటాల ప్రతిస్పందనగా గత 12 సం॥రాలుగా జన నాట్యమండలి ప్రజలలో పనిచేస్తున్న తీరు విప్లవాభిమానులంతా గమనిస్తున్నారని మా గట్టి నమ్మకం. ప్రజల సేవలో ప్రజల నుండి నేర్చుకొని మళ్ళీ ప్రజలకు నేర్పి మార్పుకోసం పరితపించే జన నాట్యమండలి నూటికి నూరుపాళ్ళు ప్రజలపై ఆధారపడ్డ ప్రజాసంస్థ జన నాట్యమండలి అనుభవాన్ని వివరించడం కోసం ఒక సావనీర్ ప్రచురించబోతున్నాం. విప్లవాభిమానులూ, రచయితలూ జన నాట్యమండలిపై తమతమ రచనలను, అభిప్రాయాలను పంపవలసిందిగా కోరుతున్నాం. సాంస్కృతిక రంగంలో పనిచేస్తున్న కార్యకర్తలు దీన్ని తమ బాధ్యతగా గుర్తించి సహకరించగలరని ఆశిస్తున్నాం. రచనలు, ఫోటోలు పంపవలసిన అడ్రసు : జన నాట్యమండలి, కేరాఫ్ సృజన, హనుమకొండ – 506001, వరంగల్, ఆంధ్రప్రదేశ్.

—జననాట్యమండలి,
ఆంధ్ర ప్రదేశ్.

---

# విజ్ఞప్తి

విప్లవ రచయితల సంఘం ఆర్థికంగా బలహీనమైనసంఘం - విప్లవ సాహిత్యాభిమానుల ఆర్థిక సహకారంతో ఒక దశాబ్దంనుంచీ విరసం ప్రజా విప్లవ పోరాటాల సాంస్కృతిక వేదికగా నిలిచింది. ప్రభుత్వ అణిచివేతనీ, రివిజనిస్టుల వక్రభాష్యాలనీ ప్రతిఘటించి సాహిత్యంలో ప్రజాపంథాని అనుసరిస్తూ ప్రజలపక్షాన నిలిచిన సంస్థ. పాలకవర్గ రచయితల రాశితో విప్లవ సాహిత్యాన్ని దెబ్బతీయాలని ప్రయత్నంచేసి విఫలం అవుతున్నారు. గుణమే ప్రధానం అయినప్పటికీ కనీస ప్రచారం. కొద్ది ప్రచురణలు కూడా లేకపోతే ఏ సంఘమూ బతకలేదు విరసం అధికార పత్రిక 'అరుణతార' ని నడపటం కష్టతరంగా ఉంది. విప్లవాభిమానులు చందాదారులుగా చేరి, విరాళాలు ఇచ్చి పత్రికని రక్షించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. విప్లవ విద్యార్థి సంఘాలకీ రైతుకూలీ సంఘాలకీ, విప్లవ సాహిత్యాభిమానులైన మేధావులకీ 'అరుణతార' పత్రికని ప్రచారం చెయ్యవలసిందిగా కోరుతున్నాం. చందాల్నీ, విరాళాల్నీ ఈ అడ్రసుకి పంపించమని మనవి -

సి. ఎన్. ఆర్. ప్రసాద్
C-108, శ్రీనివాసనగర్ కాలనీ
గుంటూరు-522 006

---

(త్వరిలో) నైజాం గుండెల్లో నగారా మ్రోగించిన

గోండు నాయకుడు

## "కొమురం భీము"

- చారిత్రాత్మక నవల -

రచన : కామ్రేడ్ సాహు, కామ్రేడ్ అల్లం రాజయ్య

- వివరాలకు -

పీస్ బుక్ సెంటర్, 4-5-421, సుల్తాన్ బజార్, హైదరాబాద్.

సంపాదకీయ వ్యాసం :-



# రా. వి. శాస్త్రి

రా. వి. శాస్త్రి అంటే రాచకొండ విశ్వనాథ శాస్త్రి ఆధునిక సాహిత్యంలో రావి శాస్త్రిది ఒక విలక్షణమైన మార్గం. రావి శాస్త్రీయం ఒక విశిష్ట రచనా పద్ధతి. కానీ చాలామంది కాలదోషం పట్టిన సాహిత్య ప్రమాణాల్ని ఆరాధించే వాళ్ళు రావిశాస్త్రి సాహిత్యంలో జీవిత చిత్రణాపద్ధతి రావిశాస్త్రి బుర్రనుంచే పుట్టినట్టు ప్రశంసల వర్షాన్ని కురిపిస్తున్నారు.

రావిశాస్త్రి సాహిత్యంలో కనిపించే జీవితం, పాత్రలూ, వాళ్ళ సంభాషణా వాళ్ళ అనుభవాలు అన్నీ సమాజంలో ఒక వర్గంనుంచీ, ఒక సామాజిక బృందం నుంచీ, ఒక జన శ్రేణినుంచీ వచ్చినవి వర్గ, బృంద పునాది లేకుండా ఎవడూ రాయ లేడు. రచయిత తనకి బాగా పరిచయం అయిన జీవితాన్ని చిత్రించేటప్పుడు ఆ జీవితపు లోతులకి వెళ్ళగలడు తనకు తెలిసిన జనాన్ని పాత్రలుగా తీసుకున్నప్పుడు మనస్తత్వపు సూక్ష్మలోకాల్ని ఆవిష్కరించగలడు కొంతమంది రచయితలకి వాళ్ళ రచనలోని జీవితంతో బాహ్యసంబంధం మాత్రమే ఉంటుంది. చెపుతున్న విషయం ఎంత గొప్పదయినా ఆ విషయంతో రచయితకి బాహ్యసంబంధం మాత్రమే ఉంటే ఆ రచన పాఠకుల్ని గాఢంగా ప్రభావం చెయ్యలేదు. తన రచనలో విషయంతో అంతరంగిక సంబంధం ఉంటే ఆ రచన పాఠకుల చైతన్య సారంలోకి వ్యాపిస్తుంది కొత్త జీవితాన్ని దర్శించినట్టు, జీవితాన్ని కొత్త దృక్పథంనుండి చూపినట్టు పాఠకుడు ఇలాంటి రచనల వల్లనే అనుభవాన్ని పొందుతాడు. రా. వి. శాస్త్రికి తన రచనల్లోని జీవితంతో అంతరంగిక సంబంధం వుంది. అందుకనే ఆయన సాహిత్యం సజీవ సాహిత్యం ఒక్కొక్క రచయితకు ఒక్కొక్క శైలి ఉంటుందనీ, ఆ శైలి రచయిత సాధన ద్వారా సాధిస్తాడని సాహిత్య విమర్శకులు చాలా కాలం నుంచీ చెపుతున్నారు. ఇది ఏమాత్రం వాస్తవం కాదు. సమూహం నుంచికాక వ్యక్తికి శైలి ఎక్కడ నుంచి వస్తుంది? రచయితల సమూహం నుంచి కానీ, తాను అంతరంగిక సంబంధం పెట్టుకున్న జన సమూహం నుంచి కానీ రచయితకి శైలి అంటే, రచనా పద్ధతి వస్తుంది. రచయితల సమూహంనుంచీ వచ్చే రచయిత శైలిని మరొక రచయిత అనుకరించ వచ్చును. విప్లవ కవుల్లో, భావ కవుల్లో, ప్రబంధ కవుల్లో కవి

పించే సామూహిక శైలికి ఒక వర్గ లేక బృంద పునాదే కారణం. రావి శాస్త్రి శైలి రచయితల సమూహ శైలిగా మారినా వర్గ, బృంద శైలికాదు. రచయితల సామూహిక శైలిగా మారని ఒక జన బృంద, ఒక జనశ్రేణి శైలి రా. వి. శాస్త్రి శైలి. కాబట్టి తప్పనిగా చెప్పుకోదగిన రా.వి. శాస్త్రి శైలి రావిశాస్త్రి అంతరంగిక సంబంధం పెట్టుకున్న జనశ్రేణి శైలికాని రా.వి.శాస్త్రిది మాత్రమే కాదు. ఇలాంటి శైలిలో మరో రచయిత రాయదలచుకుంటే రా. వి శాస్త్రి శైలిని అనుకరించడం కాక ఆ శైలిలో మూలమైన జనశ్రేణితో ఆత్మీయ సంబంధం పెట్టుకొని సాధించ వలసిందే. కోర్టు వకీలూ, పోలీసులూ, నానా రకాల అలగా జనం, విశాఖ వీధుల్లోని సాదాసీదా జనం శైలి రావి శాస్త్రి శైలి. యాసభాష లోనే కాదు భావంలో కూడా కనిపిస్తుంది. "ఇస్మాయిళ్ళు" ఎంతమంది ఎన్ని వంకరటింకరలు కొట్టినా రా. వి శాస్త్రి సాహిత్య మార్గానికి వాస్తవ సామాజిక బృంద, వర్గమూలాలు లేవని నిరూపించలేరు.

అన్ని రంగాల్లోనూ 'పోటీ' రాజ్యం ఏలుతున్నప్పుడు వ్యక్తుల్లో ఆత్మ న్యూనతా భావం ఉండటం సహజం ఎవరైనాసరే ఎప్పుడో ఒకప్పుడు 'న్యూనతా' భావాన్ని అనుభూతి పొందకుండా ఉండటం వర్గ సమాజంలో సాధ్యంకాదు అదే ప్రవృత్తిగా కూడా కొంతమందిని పీడించవచ్చును. రావి శాస్త్రి తొలినవల ఇలాంటి ఆత్మ న్యూనతా భావాన్ని చిత్రించింది. అదే "అల్పజీవి" నవల "అల్పజీవి" లో ఆత్మ న్యూనతాభావం స్పష్టంగా కనబడితే అలగా జనంలో ముఖ్యంగా రౌడీలు గజ దొంగలూ, తాగుబోతులూ, ముండల కంపెనీ వాళ్ళ ఆత్మన్యూనతా భావాన్ని దాచుకునే ప్రయత్నాన్ని అనేక పాత్రల్లో చిత్రించాడు. తక్కువే అయినా కష్టజీవిలో ఆత్మవిశ్వాసాన్ని చూపించాడు. రావి శాస్త్రి రచనల్లో అలగా జనం, అంటే లంపెన్ ప్రోలిటేరియట్ ఎక్కువ అనీ వీళ్ళని ఇంతగా వర్ణించటం తప్పు అనీ చాలామంది విమర్శకులు అంటున్నారు. లంపెన్ ప్రోలిటేరియట్ ని మార్క్స్, లెనిన్ లు ప్రమాదకరవర్గం అన్నారు. ప్రమాదకరవర్గం అంటే దోపిడీ వర్గం అని అర్థంకాదు. దోపిడీ వర్గాలకి అమ్ముడుపోయి కార్మికుల్నీ, రైతాంగాన్నీ వేధించుకు తింటారని అర్థం. అమెరికాలోనూ, ఇతర పెట్టుబడిదారీ దేశాల్లోనూ ఆదేశాల్లోని చట్టాల్ని ఉల్లంఘించే వాళ్ళని, వేరస్తుల్ని, దేశంలో విప్లవం పరిస్థితి లేనప్పుడు దోపిడీ వర్గాల మీద దాడి చేసే యువకుల్నీ, నాగాలాండ్, మిజోరాం లోని పోరాటకారుల్నీ, ఆఫ్ఘన్ గెరిల్లాలనీ, చివరికి మావోయిస్టుల్ని కూడా లంపెన్ ప్రోలిటేరియట్ అంటూ

సోవియట్ రష్యాలోని రివిజనిస్టు మేధావులు ప్రచారం చేస్తున్నారు. ఈ అలగాజనం గురించి మావో ఇలా అన్నాడు :-

## తిరుగుబోతులు

చైనా లోని అర్ధవలస, వలస సమాజం వల్ల అనేకమంది గ్రామీణ ప్రాంతాల్లోనూ, పట్టణాల్లోనూ నిరుద్యోగులయ్యారు. ఈ నిరుద్యోగుల్లో చాలామంది గౌరవప్రదంగా జీవించే అవకాశం లేకపోవడంవల్ల అక్రమ జీవితానికి అలవాటు పడిపోతారు. బందిపోటు దొంగలుగా, రౌడీలుగా, మూఢాచారాల కర్మకాండ మీద ఆధారపడి, బిచ్చగాళ్ళుగా, వ్యభిచారిణులుగా బతుకుతారు. ఈసామాజికశ్రేణికి స్వభావరీత్యా ఊగిసలాట గుణం ఉంటుంది. కొంతమంది దోపిడీ వర్గాలకు అమ్ముడు పోతారు. మరికొంతమంది విప్లవంలో చేరుతారు నిర్మాణాత్మక స్వభావం లేకపోవడంవల్లా, నిర్మాణంకంటే నిర్మూలనమీద ఎక్కువ మొగ్గు చూపడం వల్లా వీళ్ళు విప్లవంలో చేరిన తర్వాత విప్లవశ్రేణుల్లో చపలచిత్త తిరుగుబాటుదారుల భావజాలాన్నీ, అరాచక వాదాన్నీ ప్రవేశపెడతారు. అందుచేత వాళ్ళలోని విధ్వంస స్వభావాన్ని అరికట్టి ఎలా మార్చాలో మనకి తెలిసి ఉండాలి.

మావో బందిపోటు దొంగల సైన్యాన్ని విప్లవ సైన్యంగా మార్చగలిగాడు. లంపెన్ నాయకుడు ఛూతే ప్రథమశ్రేణి విప్లవ యుద్ధనాయకుడు కాగలిగాడు. ఇప్పుడు మనదేశంలో కూడా లంపెన్స్ ఒకసమస్యే. ఆనాటి చైనాలోకంటే ఇప్పుడు మనదేశంలో నిరుద్యోగులసంఖ్య చాలా ఎక్కువగా ఉంది. పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ కూడా నిరుద్యోగం విలయతాండవం చేస్తోంది. ఉన్నత విద్యావంతులు కూడా జేబు దొంగతనాల్లో, దొంగతరన్నీ నేరాల్లో పట్టుబడుతున్నారు. గూండాలకి పోలీసులు అంటే భయంలేదు కానీ కమ్యూనిస్టు విప్లవకారులంటే భయం ఉంది. వర్గపోరాట సిద్ధాంతం సృజనాత్మకమైన, చలనశీలమైన గతి తార్కిక భౌతికవాద సిద్ధాంతం. మార్క్స్, లెనిన్, మావోల కాలంలోలాగానే వర్గాలూ, వర్గసంబంధాలూ ఉండిపోవు అన్నీ మారినట్టే అవీ మారుతూనే ఉంటాయి. New Leftism అయితే కార్మిక వర్గానికంటే లంపెన్ ప్రోలిటేరియేట్‌కే విప్లవం చేయగల శక్తి ఎక్కువ ఉందని వాదిస్తోంది. కాబట్టి ఇప్పుడు మార్క్సిస్టు - లెనినిస్టు విప్లవకారులు

'అలగాజనాన్ని'గుర్తించి వాళ్ళని విద్యావంతం చేసి విప్లవంలోకి ఆకర్షించుకోవడానికి ప్రయత్నం చెయ్యవలసిందే అనడంలో భిన్నాభిప్రాయం లేదు అందుకని రా. వి. శాస్త్రి అలగాజనాన్ని చిత్రించి మహాఘోరమైన విప్లవాపచారం చేశాడని ఎవరూ బాధపడి పోవలసిన అవసరంలేదు అలగా జనాన్ని విప్లవవర్గం అని రా. వి శాస్త్రి ఎక్కడా అనలేదు. కాని వాళ్ళు ఎలా అలగాజనం అవుతున్నారో చెప్పాడు. లంపెన్ బూర్జువావర్గం కూడా వుంది. ఈ వర్గం లంపెన్ ప్రోలిటేరియేట్‌ని ఉపయోగించుకుంటూనే అనేకమందిని దారుణంగా హత్యచేస్తున్నది. రా. వి. శాస్త్రి కథల్లోనూ, నవలలలోనూ నాటకాలలోనూ 'అలగాజనం' పాత్రలు తక్కువేకాని ఎక్కువకాదు.

ప్రస్తుత ప్రముఖ రచయితల్లో ఎవరూ చెయ్యని విధంగా రా. వి. శాస్త్రి నవలలలో, కథలలో, బూర్జువా రాజ్యాంగ యంత్ర ప్రజా వ్యతిరేక స్వభావాన్ని చిత్రించాడు కోర్టులూ, పోలీసు వ్యవస్థ, నిరంకుశ ఉద్యోగులూ, సర్పంచ్‌లనుంచీ మంత్రులదాకా పార్లమెంటరీ వ్యవస్థా రావి శాస్త్రి రచనలలో అతి తీవ్రమైన విమర్శకి గురిచేయబడినాయి వీటిలో లోపాల్ని, అవినీతినీ, హింసని హాస్యరూపంలో బీభత్సంగా చిత్రించాడు. 'నిజం' నాటకంలో మన న్యాయవ్యవస్థని బోను ఎక్కించాడు. ఈ విషయంలో రా. వి శాస్త్రి సాటిలేని మేటి రచయిత. Stateism ఎంతగా మన నిత్యజీవితంలో కూరుకుపోయిందో జీవితపు లోతులనుంచీ విశ్లేషించాడు. అలా అని కేవల రాజ్యాంగ యంత్ర వ్యతిరేకతనే చెప్పలేదు. శ్రామిక రైతాంగ పోరాటాలద్వారా బూర్జువాయంత్రాంగం స్థానంలో శ్రామికవర్గ రాజ్యాంగ యంత్రాన్ని స్థాపించుకోవాలనే చెప్పాడు.

విప్లవ రచయితలసంఘం ఏర్పడిన నాటినుంచీ ఎమర్జన్సీవరకూ రావి శాస్త్రి ఉపాధ్యక్షుడుగా ఉన్నారు. వి. ర. సం. ప్రణాళిక మీద జరిగిన చర్చలలో నయా రివిజనిస్టు నాయకుడు మోటూరు హనుమంతరావుని గట్టిగా ఎదుర్కొన్నారు. విరసం సభ్యుల్ని అరెస్టు చేసినప్పుడూ, పుస్తకాల్ని నిషేధించినప్పుడూ తీవ్ర నిరసన తెలియచేశారు విరసం సభ్యులను మీసాకింద 1973 లో ప్రభుత్వం నిర్బంధించినప్పుడు హైదరాబాద్‌లో సెక్రటేరియేట్ దగ్గర విరసం చేసిన నిరసన ప్రదర్శనలో పాల్గొన్నారు.

విరసం సభ్యుల మీద బనాయించిన సికింద్రాబాద్ కుట్రకేసు విచారణలో క్రాస్ యగ్జామిన్ చేయడానికి హాజరయ్యారు. 1980 లో విరసం దశాబ్ది సభలకి వచ్చి, 'విరసం నా కంటే గొప్పది. వ్యక్తిగత కారణాలవల్ల నేను సభ్యుడుగా ఉండలేకపోయాను' అని చెప్పారు. విశాఖలో విరసం సభలన్నిటికీ హాజరు అవుతూనే ఉన్నారు. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' 'సౌమ్యులు పోనాయండి' నవలలు రెండూ విరసం ఆశయాల వెలుగులో రాసినవే. 'బాకీ' కథల సంపుటిలో ప్రతి వాక్యంలోనూ విరసం ముద్రఉంది. 'వేతనశర్మ' కథ రివిజనిస్టు పతనగాథ. రంగు మార్చకుండా దిక్కుమార్చిన పంజకెంజాయ పార్టీలను ఎండగట్టినకథ.

'పిపీలికం' లో శ్రామికవర్గం వర్గస్పృహలేని Thing - in itself నుంచి వర్గచైతన్యాన్ని పొందే Thing for itself వరకూ జరిగే క్రమాన్ని చిత్రించారు. రావి శాస్త్రి ఈనాటికీ విరసం ఆశయాల్ని సంపూర్ణంగా ఆమోదిస్తున్నారు. విరసం రావి శాస్త్రి వెంబడిపడుతోంది, రావి శాస్త్రి విరసం వెంబడిపడడంలేదు అని పురాణం సుబ్రహ్మణ్యశర్మ ఒక కొత్తిమెరఅట్టు విసిరాడు. విరసం ఏ రచయిత వెమ్మటయినా పడుతుంది విరసం ఆశయాలవైపు రచయితలను మార్చడం, విప్లవాభిమానులైన రచయితల్ని సంస్థలోకి సమీకరించడం విరసం కర్తవ్యాలు. విరసం ఆశయాల్ని ఆమోదిస్తూ నిర్మాణంలో ఇమడలేక పోవడం తనలోని వైరుధ్యం అని ఆయనే అంగీకరిస్తున్నాడు రచయితల వ్యక్తిగత బలహీనతలను ఉపయోగించుకోవడం పురాణం పని కానీ మాపని కాదు. మాకు కావలసింది రచయితలలోని బలం, ధైర్యం, త్యాగం.

విప్లవ రచయితలసంఘం ఉపాధ్యక్షుడుగా ఉండి రావి శాస్త్రిగారు ఎమర్జన్సీలో జైలుపాలయ్యారు. విరసంలో సభ్యత్వానికి తన విడుదలకు ఏలినవారు బేరంపెట్టారు. నేను రావి శాస్త్రినే కాని రాజీనామాశాస్త్రిని కానని మొదట్లో వాళ్ళ ముఖానే చెప్పారు. కాని ఆమాటమీద చివరికంటా నిలబడలేకపోయారు

సంస్థకు నాయకత్వం వహించవలసిన వ్యక్తి సంస్థ క్లిష్టపరిస్థితులలో ఉన్నప్పుడు రాజీనామా ఇవ్వటం అన్యాయం రచయితగా, లాయరుగా అసలు మనిషిగా రావిశాస్త్రి అపని చెయ్యనేకూడదు. ఇది చిన్న తప్పుగా విరసం అప్పుడూ భావించలేదు ఇప్పుడూ భావించడం లేదు అలాగే రచయితగా రచనలో విగ్రహం ప్రదర్శించవలసిన సందర్భంలో హద్దులుదాటి అనవసర వర్ణనలుచేసి భావగాంభీ

ర్యాన్ని చెరగొట్టటం, జుగుప్స కలిగించవలసిన విషయాల మీదా, వర్తనల మీదా చమత్కార లంపటత్వంతో వినోదాన్ని కలిగించడం, స్త్రీ పాత్రల్ని చిత్రించే టప్పుడు సంస్కారవంతం కాని, సందర్భానికి ఉచితం కాని అధిక ప్రసంగాలు చెయ్యడంవంటి లోపాల్ని విరసం ఆమోదించదు.

రావి శాస్త్రిగారి కలం కష్టజీవులకే అంకితమయింది. నక్సల్‌బరీ, శ్రీకాకుళ రాజకీయాల ప్రభావం రావి శాస్త్రిగారిమీద వుంది వర్గపోరాటంమీద కాకుండా శ్రామికవర్గ నియంతృత్వం కూడ తప్పనిసరి అని విశ్వసించే రచయిత రావి శాస్త్రి. విరసం అంటే గాఢమైన గౌరవం ఉంది. అందుకే రావి శాస్త్రీయాన్ని ప్రచురించాం. రావి శాస్త్రి సాహిత్య సమాలోచన చేశాం. శాస్త్రిగారూ మా విమర్శనాత్మక గౌరవాన్ని స్వీకరించండి :

— త్రిపురనేని మధుసూదనరావు,
తిరుపతి,
24-9-1982.

---

# మనవి

ఏజంట్ల దగ్గర బకాయిలు బాగా పేరుకొనీ, చందాదారులుగా చేరి చందాలు చెల్లించనివారూ, రెన్యూ చేయనివారూ, కారణంగా 'అరుణతార' తీవ్రమయిన ఆర్థిక ఇబ్బందులకు లోనయి ఆగస్టు, సెప్టెంబర్ సంచికలు వెలువడలేదు. సెప్టెంబర్ 14న విరసం కార్యవర్గం తీసుకున్న నిర్ణయం మేరకు 'అరుణతార'కు విరాళాలు, చందాలు, ఏజెంట్ల నుంచి బకాయిలు సేకరించే క్యాంపెయిన్ తొలి విజయంగా ఈ అక్టోబర్ సంచిక ఎక్కువ పేజీలతో వెలువడుతున్నది. ఇకముంచి పత్రిక సక్రమంగా వెలువడాలంటే ముఖ్యంగా విరసం సభ్యులు, "అరుణతార" పాఠకులు, అభిమానులు తమ క్యాంపెయిన్‌ను ఒక నిరంతర కార్యక్రమంగా నిర్వర్తించాల్సి వుంటుందని విజ్ఞప్తి చేస్తున్నాం.

—కార్యదర్శి, విరసం
మేనేజర్, 'అరుణతార'

---

# రావిశాస్త్రి రచనల్లో రాజ్యాంగయంత్రం

— కె. బాలగోపాల్

రాజ్యాన్ని గురించీ రాజ్యాంగ యంత్రాన్ని గురించీ వకీళ్ళకు అర్థమయినంతగా మరెవ్వరికీ కాదేమో; వాటి గురించి అపోహలు గూడ వేరెవ్వరికయినా ఉండవచ్చునేమోగాని వకీళ్ళకుమాత్రం సహజంగా నయితే ఉండటానికి వీలులేదు. [‘సహజంగా నయితే’ ఎందుకంటే, వ్యవస్థను సంరక్షించే తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ రాజ్యాంగయంత్రం ఆక్రమంలోనే వకీళ్ళ కడుపులూ బ్యాంక్ అకౌంట్‌లూ గూడ పుష్టిగా నింపుతుంది కాబట్టి; అది వేరే విషయం)

స్కూళ్ళలోను కాలేజీల్లోను రాజకీయశాస్త్రమో పౌరశాస్త్రమో చదువుకునే దౌర్భాగ్యులకు, రాజ్యాంగయంత్రంలో మూడుభాగా లుంటాయని, వాటిని న్యాయశాఖ, కార్యనిర్వాహకశాఖ, శాసనశాఖ, అంటారనీ నేర్పుతారు. ఆ దుర్భాగ్యం రావిశాస్త్రికి చిన్నతనంలో కలగలేదు కాబోలు, ఆయనకు ఆ మూడింటిలో మొదటి రెండే కనబడ్డాయి. అందులోను రెండవదానిలో పోలీసులూ, ‘వూరి ప్రెసిడెంటోడూ, ఏమ్మెల్యే నెంబరూ’ మాత్రమే కనబడ్డారు. ఆ ప్రెసిడెంటోడు గూడ తన చీకటి రూపంలోనే గాని వెల్తురు రూపంలో - అంటే కార్యనిర్వాహకుడిగా - కనబడ్డాడు కాదు. వృత్తిరీత్యా రాజ్యాన్ని రాజ్యాంగ యంత్రాన్ని ‘క్రిమినల్’ కళ్ళతో చూడడం రావిశాస్త్రికి సహజం అయితే కావచ్చు గాని, ఆ దృష్టి చాలా పాక్షికం. వర్గసమాజంలో అన్యాయం చీకటి వ్యవహారం కాదు, వెల్తురు వ్యవహారమే. ప్రెసిడెంటోడు చేసే ప్రెసిడెంటేతర చీకటి పనులలో కాదు. వెల్తురులో చేసే ప్రెసిడెంటు పన్లలోనే వ్యవస్థ దుర్మార్గమంతా వుంది. దాసరి పోలిగాడినుండి తీసుకున్న దొంగ తనఖాలో కాదు, సర్కారువారి భూమి తనఖా బ్యాంకులతోనే వుంది

పాక్షికమయితే కావచ్చుగాని, రావిశాస్త్రి దృష్టి ప్రసరించినంతమేరకు చాలానిశితమయినది, ఇసుకరేణువులను సహితం వేరుచేయగల సత్తాగలది నేరానికీ రాజ్యాంగ యంత్రానికీ మధ్యవున్న సంక్లిష్టమయిన పరస్పరతను అణువణువూ కణంకణమూ వివేచించి అడ్డుకోతపటాలూ నిలువుకోతపటాలూ మాత్రమే తక్కువగా వివరించగలది.

ఈ పరస్పరత రెండురకాల అమాయకులకూ అర్థం కాదు. అమాయకు లయిన అమాయకులు (వీళ్ళు మొదటిరకం), నేరాన్ని అరికట్టడం, నిరోధించడం, రాజ్యాంగయంత్రం పని అనుకుంటారు. ఈ కోవకు చెందిన వాళ్ళు బడిపంతుళ్ళు కుర్ర ఐ. ఏ. ఎస్. ఆఫీసర్లు. రెండవరకంది దుస్సాహసిక అమాయకత్వం రాజ్యాంగయంత్రం నేరాన్నసలు అరికట్టనే అరికట్టదని, నేరం మీద బతకడమే ప్రభుత్వ 'కార్యనిర్వాహకుల' పని అని అనుకుంటుంది. ఈ కోవకు చెందినవాళ్ళు సాధారణంగా కవిత్వం రాస్తారు.

అసలు సంబంధం ఇదీకాదు, అదీకాదు. బూర్జువా రాజ్యాంగ యంత్రం నేరాన్ని సంపూర్ణంగానూ అరికట్టదు (అది దానికి అవసరమూ కాదు, శ్రేయస్కరమూ కాదు), అలాగని నేరాన్ని పనిగట్టుకుని పోషించనూ పోషించదు అది నేరాన్ని రెగ్యులేట్ చేస్తుంది. రావి శాస్త్రి మాటల్లో ('తలుపుగొళ్ళెం'), భూమ్మీద మనిషికి ముఖ్యమయిన పనుల్లో

మొదటిది : దొంగతనం చేయడం

రెండవది : దొంగల్ని పట్టుకు శిక్షించడం

భూమ్మీద ఎల్లకాలం కాకపోయినా – పెట్టుబడిదారీ సమాజంలో, మొదటిదీ రెండవదీ కాకపోయినా అతి ముఖ్యమయిన పనుల్లో, ఈ రెండూ లెక్కకు వస్తాయి. ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవస్థ అందరికీ పని ఇవ్వలేదు; ఇవ్వడం దానివల్లకాదు, కాకుండా ఇస్తే నిరుద్యోగ భయంపోయి కార్మికులు పట్టపగ్గాలు లేకుండా పోతారు. అయితే దేశంలో నిరుద్యోగులు మరీ ఎక్కువయిపోయినా ప్రమాదమే. నిరుద్యోగులంతగా అరాచకత్వానికి సహితం వెనకాడకుండ తిరగబడే వాళ్ళుండరు. కాబట్టి, తాము ఉత్పత్తిదాయకమయిన పని (Productive work) చూపలేని వాళ్ళలో కొందరికి (కొందరికే) నేరాన్ని ఒక మార్గంగా చూపుతుంది బూర్జువా సమాజం. అమెరికాలో ఇవ్వాళ 10 శాతం నిరుద్యోగ ముందట. అక్కడ నేరమే లేకుంటే అది 25 శాతానికి (కనీసం) పెరుగుతుంది. అట్లా పెరిగితే చాలా ఇబ్బంది. అందుకే 'దొంగతనం చేయడం' అవసరం. అంతేకాకుండ, సోషలిస్టు భావాలు బాగా ప్రచారమయిపోయిన ఈ రోజుల్లో చట్టబద్ధమయిన వ్యాపారంలో గడించే లాభానికి కొన్ని పరిమితులుంటాయి. టాటా బిర్లాలు తమ పెట్టుబడి మీద

10-15 శాతం లాభం పొందుతున్నమాట, వాస్తవమేగాని అంతకుమించితే పార్లమెంటులోని కమ్యూనిస్టు నాయకులు గొడవ పెడతారు చచ్చి మార్క్సిస్టు స్వర్గాన వున్న జ్యోతిర్మయి బసు వంటి వికార్పుగాళ్ళు మొనోపొలీ కమీషన్లలోను పార్లమెంటరీ కమిటీలలోను చేరి వర్గపోరాటం ప్రకటిస్తారు అందుకని - దొంగసారానుంచి దొంగ సిమెంటు వరకు - రకరకాల దొంగవ్యాపారాలు అవసరం అందుకోసం గూడ 'దొంగపని చేయడం' అవసరం అయితే ఈ దొంగతన్లు మితిమీరిపోతే అసలుకే మోసం వస్తుంది నేరాన్ని అరికట్టకపోయినా కనీసం అదుపులో వుంచుకోలేని ప్రభుత్వాన్ని ఏ ప్రజలూ గౌరవించరు. దానికి 'లెజిటిమెసీ' పోతుంది. అప్పుడు కొంపలంటుకపోతాయి. అందుకే 'దొంగల్ని పట్టుకు శిక్షించడం' అవసరం.

సూక్ష్మీకరించి చెప్పాలంటే, నేరం బూర్జువా సమాజపు సంక్షోభాలకు ఒక సేఫ్టీవాల్వులాంటిది. అవసరమయినప్పుడు దాన్ని తెరవకపోతే ఒత్తిడికి తట్టుకోలేక ఇంజను పగిలిపోతుంది. అలాగని సేఫ్టీవాల్వుని ఎప్పుడూ తెరిచి వుంచితే ఇంజను అసలుపని చేయదు. అంటే దాన్ని రెగ్యులేట్ చేయాలి, అదుపులో వుంచుకోవాలి. సరిగ్గా అదే (నేరానికి సంబంధించి) రాజ్యాంగ యంత్రం కర్తవ్యం. ఆ సేఫ్టివాల్వును తెరవడంలోను, బంద్ చేయడంలోను 'కార్య నిర్వాహక శాఖ' అని పిలవబడే పోలీసులు పనిలో పనిగా తమ చేతులు తడుపుకుంటారు తమకు పైసలీయగల పురానా దొంగలను వదిలిపెట్టి చిన్నదొంగలను పట్టుకొని (న్యాయంగానో అన్యాయంగానో) శిక్షిస్తారు. (అంతేగాని వాళ్ళ చేయి తడుపుడుకోసమే నేరం ఉందనుకోవడం అమాయకమయిన పొరపాటు).

దీనంతటి అర్థం, రాజ్యాంగ యంత్రం నేరాలలో ఏ 20 శాతాన్నో పరిష్కరిస్తుందనీ, నేరస్తులలో ఏ 20 శాతాన్నో శిక్షిస్తుందనీ ఎంతమాత్రం కాదు. నేరం కంట్రోల్‌లో వుండడం, రాజ్యాంగయంత్రం దాన్ని కంట్రోల్‌లో వుంచుతున్నట్లు జనానికి కనిపించడం, అసలు విషయాలు. దానికి నేరాలను పరిష్కరించాల్సిన అవసరంగాని, నిజమయిన నేరస్తులను నిజమయిన నేరాలకు శిక్షించాల్సిన అవసరంగాని, ఎంతమాత్రం లేవు. అప్పుడప్పుడు కంపెనీలనూ సారాకొట్లనూ 'రెయిడ్' చేస్తూంటే చాలు (ముందుగా కబురు పంపించి చేసినాసరే). అవేళ్లి. ఎక్కడి దొంగలు అక్కడ గప్‌చుప్. అదొక మార్గం. గంగరాజెద్దు ('రత్నాల-

రాంబాబు లో) తన శిష్యుడికి చెప్పే కథలో రెండవమార్గం వుంది. 'కలెక్టరుగారి పియ్యే పెళ్ళానికి' ఆరుతులాల గొలుసు, నాలుగు తులాల గాజులు, పోయ్యాయట పెద్దవాళ్ళ ఇంట చోరీ గొడవకు దారితీస్తుంది కాబట్టి ఏదో చేసినట్టు కనిపించాలి ఎస్సై 'పరిపాటితనం' మీద కాక 'రికమండేషన్' మీద పైకొచ్చిన కుంక కావడాన ఆ బాధ్యత గంగరాజెద్దుమీద పడింది. 'ఏదో చెయ్యాలి' గాని నేరస్తుణ్ణి పట్టుకోవాలన్న నిర్బంధం లేదని ఎరిగిన సదరు హెడ్డు వూళ్ళోని కేడీల లిస్టు తిరగేసి ఒకానొక కేడీని 'పాతికతులం బంగారం ఇస్తాను కేసొప్పుకుంటావా?' అని అడుగుతాడు తులానికి తొంబయి కేసులొప్పుకోగల ఆ కేడీ దానికి సై అంటాడు. అప్పుడు. ఊళ్ళోని పెద్దబంగారం కొట్టు యజమాని ఆ దొంగబంగారం కొన్నట్టు, అతనికి ఈ కేడీ దాన్ని అమ్మినట్టు, కేసు పెట్టించి పన్నెండు తులాల బంగారం రికవర్ చేసి అందులో పదితులాలు 'కలెక్టరుగారి పియ్యే పెళ్ళానికి', పాతికతులం కేసొప్పుకొని జెయిలుకు పోయిన కేడీకి, మిగతాది మిగతావారికి ఇప్పిస్తాడు గంగరాజెద్దు. జరిగిన నేరానికి శిక్షింపబడ్డవారికి దొరికిన బంగారానికి ఏ సంబంధం లేదు, ఉండాల్సిన అవసరంలేదు. అసలు బంగారం దొరికిన తరువాత అందులో కొంత ఇంకో కేసులోకి, 'మిగతాది మిగతా చోట్లకి' వెళ్ళిందట (వివరాలు అంతగరం పెద్దమనుషుల లక్షణం కాదు గనక అడగొద్దు). ఇక్కడే మరొక కిటుకుంది. అదేమిటంటే కేవలం చిన్నవాళ్ళనే కాకుండ అడపాదడపా పెద్దవాళ్ళను గూడ శిక్షించడం గంగరాజెద్దు మాటల్లో, 'పెద్దోళ్ళకి అప్పుడప్పుడు మనం అలా జుల్మానా లేస్తుంటేగాని జాతి ముందరికి నడవదు'. పైగా. పెద్దోళ్ళ కలా అప్పుడప్పుడు సురకలు తగిలించడాన్నే సోషలిజం అంటారు చదుంకున్నోళ్ళు.

మూడవ మార్గం మరీ పెద్ద మనిషి తరహాది. ఇక్కడ రెయిడుల్లాంటి 'అథార్టీ' చెలాయించడం గాని, తప్పుడు కేసుల కింద నేరం చేయని వాళ్ళను శిక్షించడం గాని, వుండదు. అధోప్రపంచానికి కొన్ని నియమాల్ని ఏర్పరచి ఆ కట్టుదిట్టాలను ఎవ్వరూ ఉల్లంఘించకుండా చూడడం ఈ పద్ధతి. ఒక చక్కటి ఉదాహరణ సారాకథ 'పాపి', రామదాసు, నీలయ్య, ఘరానా సారావ్యాపారస్తులు, ఒకరి కొకరు పోటీదారులు. అయినా ఈ మొనోపొలీ రోజులలో పెట్టుబడిదార్లు పోటీపడకుండ జాగీర్లు పంచుకోవడం అలవర్చుకున్నారు గనక దాసు, నీలయ్యలుగూడ ఒకరు వూరి తూర్పు ప్రాంతాన్నీ ఒకరు పడమటి ప్రాంతాన్నీ పంచుకున్నారట. 'ఆనాజీషరతు

లకు కట్టుబడే రక్షకశాఖవారు గూడ శాంతిభద్రతలు కాపాడుకుంటూ వస్తున్నా' రట. ఫలితంగా, 'ప్రాతఃకాలంలో, సాయంసంధ్యలో, నిశిలో, సారా 'మోటారు ట్యూబుల్లో' ప్రవహిస్తోందట. 'మూడుబుడ్లూ ఆరు గ్లాసులుగా' సారాప్రపంచమంతా శాంతి సామరస్యాలతో వర్ధిల్లుతోందట. ('కార్యనిర్వాహక శాఖ' కు ఎంతమాత్రం ముట్టిందో పెద్దగా చెప్పుకోవడం పెద్దమనుష్యుల లక్షణంకాదుగనక రావిశాస్త్రిమనకు చెప్పడుకాని. తగుమాత్రం ముట్టే వుంటుంది) ఈ ప్రవాహమే లేకుంటే ఆ బళ్ళ వాళ్ళు, ఆ సైకిళ్ళవాళ్ళు, ఆ ట్యూబులు మోపేవాళ్లూ ఆకార్లు తోలేవాళ్లూ ఏమయి పోవాలి ? ఈ దౌర్భాగ్యపు అర్ధవలస దేశం వాళ్ళకు ఉద్యోగాలెక్కడి నుంచి చూసి పెడుతుంది ? ఆ సారావ్యాపారంలోని పెట్టుబడి అంతంత లాభాలు మరెక్కడ సంపాదించుకోవాలి ? అగ్గిపెట్టెలూ సబ్బుబిళ్ళలూ తయారుచేస్తే వస్తుందా ?

అయితే ఒకనాడు తగువొచ్చింది దాసు జాగీర్లోకి నీలయ్య ప్రవేశించగా నీలయ్యకు దాసు 'క్విట్' నోటీసు ఇచ్చాడు నీలయ్య వినుకున్నాడుకాదు. క్రొద్దిక్రొద్దిగా అగ్గి రాజుకోవడం చూసి ఇన్‌స్పెక్టర్ రంగంలోకి దిగి నీలయ్యను 'వాడి జాగాలో నువ్వెందుకు ?' అని చీవాట్లు పెడ్తాడు అంతా తన మంచికే అని ఎరిగిన లోకజ్ఞుడు నీలయ్య పైకి మాత్రం 'సారా అమ్ముకునే దొంగముండ కొడుకులం దొంల్ని ఏంచేయగలం ?' అని విస్ఫూరాలు పలికి తొలగిపోతాడు. తొలగయితే పోతాడుగాని దాసుమీద కోపం పెంచుకుంటాడు. 'కార్యనిర్వాహకశాఖ' కు ఎన్ని పైసలిస్తాడోగాని వాళ్ళ దాసు రిక్షాలను, రిక్షాలోని ట్యూబులను, ట్యూబుల్లోని సారాను, చేజిక్కించుకొని రిక్షాలు మూడింటిని 'గవర్నమెంటుకు కలిపేసు'కున్నా రట. అటు పిమ్మట దాసు తన ప్లీడరుకు 'ఒందరూపాయలకాగితం' దగ్గరుంచుకొని 'అయిదారాబాదెళ్లైనా సరే రిక్షాలు ఇడిపించ'మని పురమాయించి తాను మాత్రం గుట్టు చప్పుడవకుండ 'పరమేశ్వరుని లీలా మాహాత్మ్యం' సాయంతో నీలయ్యను చంపేస్తాడు. దాసునుగాని ఎవరినిగాని పోలీసులు అరెస్టుచేసి వుండరని ఊహించవచ్చు. గుట్టుచప్పుడుకాకుండడం ముఖ్యం చప్పుడయితేనే చట్టమూ శిక్ష అనే సేఫ్టీ వాల్వులను తెరవాల్సి వుంటుంది కానంత వరకు అంతా సాఫ్‌సీదాయే

నేరానికి బూర్జువా రాజ్యాంగ యంత్రానికి వున్న ఈ పరస్పరతలో ప్లీడర్లూ మేజిస్ట్రేటులూ భాగం పంచుకుంటే సరేగాని, లేకపోతే అది వాళ్ళనుగూడ బొమ్మల్ని చేసి ఆడిస్తుంది. కుర్రప్లీడరు మూర్తి ('మాయ'లో) అందరు కుర్రవాళ్ళ

లాగే అమాయకుడు. ఒకనాడు అతని దగ్గరికి ఒక 'గెద్ద' లాంటి క్రోకర ('జామీను మనిషి') ముత్తేలమ్మ అనే ఒక ఆడమనిషిని తెస్తాడు. సారావ్యాపారంలో ఒకనాడు బతికిచెడి ఇప్పుడు 'సారా తప్ప వొణ్ణం ముట్టని' మొగుడ్నీ తిండిలేని ఇద్దరు పిల్లలనూ పోషిస్తూ, తన్నూ తన సంసారాన్నీ అమ్మేసినా వందరూపాయలు గిట్టని అర్భకురాలు ముత్తేలమ్మ. అయినా ఆమెలో చేవచావలేదు. అమ్మకపు సరుకుల సమాజపు వ్యాపారనీతిలేదంటుంది. 'సదువుకునోడివి నీకూలేదు, సదువులేన్దాన్ని నాకూలేదు' అంటుంది. చిన్నకూతురు- పోలీసులు చెప్పకుండా ఎప్పుడయినా రెయిడుకువస్తే 'కుక్కలొస్తున్నాయ'ని అమ్మకు వార్నింగిచ్చేపిల్ల - ఒక నిజమయిన పిచ్చికుక్క కరవగా చనిపోయిన దుఃఖంలో పోలీసోళ్ళకు మామూలివ్వలేదని హెడ్డు తన మీద సారాకేసుపెట్టేడంటుంది హృదయవిదారకమయిన ఆమె కథకు చలించిపోయి ఫీజు వందనుండి పాతిక్కుదించి ఆమెకేసు చేస్తాడు మూర్తి తన ప్రావీణ్యమంతా ఉపయోగించి హెడ్డు చేత పప్పులోకాలేయించాననుకుంటాడు, సంతోషిస్తాడు. 'హెడ్డుబాబుసాచ్చికం' తేలిపోయిన కారణంగా కేసుకొట్టేయబడుతుంది అయితే పాపం అతని సంబరానికి చిల్లుపొడుస్తూ ముత్తేలమ్మ అసలు విషయం చెబుతుంది- తాను 'కట్నం నదివిచ్చుకొని తేలగొట్టేయించింద'ని. పైగా ఇలాంటి రివాజు కేసుల్లో ఏ ప్లీడరూ వాళ్ళను పప్పులోకాలేయించలేదని, అన్నీ ఏ విధంగా పకడ్బందీగా సాగిపోతాయో వివరిస్తూ మరొక చిన్న లెక్చరిస్తుంది. అంతాచెప్పి, పూర్తిగా నీరుగారిపోయిన మూర్తిమీద మళ్లీ జాలివేసి "నువ్వుగూడ బాగానే అడిగావులె"మ్మని సర్టిఫికేటిస్తుంది మూర్తికి 'అంతా అసందర్భంగాను, కనుకట్టుకట్టినట్టుగాను, మాయగాను' తోచిందట. 'సారా అసలు దొరకలేదు. దొరికిందని కేసుపెట్టారు దొరకలేదని తిరిగితేలగొట్టేసారు.... జరిగిందని చెప్పబడ్డ జరగని విషయం జరగలేదన్నారు' అని విస్మయం చెందుతాడు. అంతామాయే. కాని 'ఆ మాయ మధ్య ఎంతబాధ!' అనిగూడ అనుకున్నాడట. అయినా మూర్తి బహుశా సర్దుకుపోయి సగటు ప్లీడరులాగా తానూ ఆ మాయలో భాగస్వామి అయిపోతాడనిపిస్తుంది.

అటా సర్దుకుపోయే మరొకడు 'న్యాయం'లో మేజిస్ట్రేటు నేరాన్ని పకడ్బందీగా నియంత్రించే రాజ్యాంగ యంత్రపు వాస్తవకర్తవ్యానికి 'న్యాయం' అనే నకిలీ ముసుగు తగిలించడంవల్ల ఒక కొత్త నకిలీ పరిభాష ఏర్పడుతుంది వాస్తవానికీ ఆ ముసుగుకూ మధ్య ఎంత ఎడంవుందో ఆ పరిభాషకూ దాని తాత్ప

ర్యాపికి గూడ అంత ఎడం వుంది. ఆ పరిభాషలో 'కేసు ఒప్పేసుకోవడం' వేరు, నేరం చేసినట్టు అంగీకరించడంవేరు. మేజిస్ట్రేట్ ముందుకు ఒక 'పతిత'నుతెస్తారు. ఆమె పతితే గాని కద్దల్లో పతితలాగా లేదట. చూస్తే కడుపులో వికారం పుట్టించే టట్టుందట. ఆమె 'నూకరాజుకంపెని'లో వుంటుందట అటెట్లాంటి కంపెనీయో తెలియని 'పాదస్తం ముండాకొడుక' యిన మేజిస్ట్రేటు ఆమెను ఏం పనిచేస్తావని అడుగుతాడు. గత్యంతరంలేక 'హెడ్డు' వివరిస్తాడు.

ఒక 'గేలం' వంటసారా ఆమె దగ్గర దొరికిందని ఆమెమీదకేసు, 'మదరాస్ ప్రొహిబిషన్ అక్ట్ సెక్షన్ 4(1) ఎ' క్రింద కేసుపెట్టారు. అభారీసెక్షన్ క్రింద పెట్టబడ్డకేసులో 'నేరంచేసావా ?' అని అడుగుతాడు మేజిస్ట్రేటు ఆమెను.

'కేసువొప్పేసుకుంటానండి' అందామె

'అంటే, నేరం చేసేనన్నంటావా ?'

'కేసు కొప్పేసుకుంటానండి'

'నేరం చేసావా ?'

'కేసుకొప్పేసుకుంటాను బాబుగారు'

'అంటే నేరం చేసేనన్టావా ?'

'నేనేం నేరం చెయ్యలేదండి'

'అయితే కేసుకొప్పుకుంటానని ఎందుకంటున్నావు ?'

'కేసు కొప్పేసుకుంటానండి'.

కేసుకొప్పేసుకోవడంవేరు, నేరం చేయడం వేరు. మొదటిది, రాజ్యాంగ యంత్రం అధోప్రపంచాన్ని నియంత్రించే కార్యక్రమంలో అప్పుడప్పుడు పేదల పాలిట అవసరమయ్యే ఎత్తుగడ రెండవది వేరు, అది నీతికి నిజానికి సంబంధించిన విషయం ఈ నకిలీ న్యాయపు నకిలీ పరిభాషకూ దాని తాత్పర్యానికి ఉన్న ఎడం మొదట్లో అర్థం కాక, ఆ ఒక్కకేసుతోనే గంటలు గడుపుతాడు మేజిస్ట్రేటు. "నేరం చెయ్యలేదట, కేసు ఒప్పేసుకుంటుందట' అని తికమకపడి తనకిన్నిసమస్యలు ఎవరెవరో కుట్రలుపన్ని తెచ్చిపెడుతున్నారని తిట్టుకుని 'ఏదీ ఎవ్వరూ సాక్షిగా

సవ్యంగా నడవ నివ్వరు' అని విసుక్కుంటారు. ముద్దాయి ఏడిస్తే ఆమెది దొంగఏడుపని తీర్మానించిన లోకజ్ఞులు ఇన్‌స్పెక్టరు, హెడ్డు, ఆమెను తిడతారు. జాలిపడి మేజిస్ట్రేటు 'అవిడ్నేం భయపెట్టకండి' అని విసుక్కుంటాడు. కాని కాసే పయ్యాక ఆమెగూడా 'మనలాటి మనిషేనా !' అని ఆశ్చర్యపోతాడు. ఎటూపాలు పోక పోలీసులవైపు తిరిగి సిగ్గుసిగ్గుగా 'ఆ కంపెనీలు- మీరు చెప్పినవి- ఎందుకు ఎత్తించేయరూ ?' అని అమాయకంగా అడుగుతారు 'ఎత్తించేస్తున్నాం సార్ ! ఎత్తించేస్తె వీళ్ళు రోడ్లు కాపేస్తున్నారు సార్ !' అని తమ అసహాయత తెలియ బరుస్తాడు ఇన్‌స్పెక్టరు "ఏ బతుకు బతికే వాళ్ళు ఆబతుకు బతకాలి కదా బాబు గారూ" అని తత్వం చెబుతాడు ఫిలాసఫర్ అయిన హెడ్డు ఆ తత్వంలోనే అసలు సత్యం వుంది ఇలాంటి రకరకాల బ్రతుకులు లేందే ఈ సమాజం నడవదు- ఎటొచ్చీ ఆ బతుకులు మరీ బరితెగించేస్తె, తమకు మరీ "టెరిబుల్ న్యూసెన్సు"గా తయారయితే, పై పెచ్చు ఆ గిక్కు మాలిన న్యూసెన్సుగాళ్ళు లంచాలిచ్చుకోలేని వాళ్ళయితే, ఈ ముద్దాయిలాగా వేశ్యాజీవితపు బాధభరించలేక తాగిరోడ్డు మీద పడిపోతే, అప్పుడు హెడ్డూ, ఇన్‌స్పెక్టరూ రాకా తప్పదు, దొంగకేసు ("గేయింసారా" దొరికిన కేసు) పెట్టకా తప్పదు.

ఇదంతా మేజిస్ట్రేటుకు అర్థం అయినా కాకున్నా తనపని ఒత్తిడి అతన్ని సర్దుకుపోయేలా చేస్తుంది. 'నీ కోర్టులో నెలకి ఎన్నికేసులు? కనీసం అయిదువందలు. కొండ కొండా చొప్పున అయిదు వందల కొండలు తవ్వాలంటే తవ్వు, దానికి నీకు శక్తుంటే ఉండొచ్చు, కానిచైముందా ? ఆలోచించు' అని అనుభవజ్ఞుడయిన పెద్ద మనిషి ఒకాయన ఇచ్చిన సందేశం గుర్తుకొచ్చి, ముద్దాయికి 'ఒకనెల' వేస్తాడు. ఆటుపిమ్మట 'మిగతా కేసులన్నీ చకచక పిలవ నారంభించే'డట. దాంతో ఆయన గారి 'చాదస్తాని'కి ఫుల్‌స్టాపే.

అయితే పాపం అందరు మేజిస్ట్రేటులూ అట్లా సర్దుకుపోలేరు (కనీసం రావిశాస్త్రి కథల్లో). రాజ్యాంగ యంత్రం తగిలించుకునే ఈ న్యాయమనే దొంగ ముసుగుకూ దాని వాస్తవ కర్తవ్యానికీ మధ్యవున్న ఎడం తనలో తన మానవాంశకూ వృత్తిజీవికీ మధ్య సృష్టించిన అంతరంవల్ల స్కిజ్రోఫెనిక్‌గా మారి 'మెంటల్' కేసవుతాడు, "మోక్షం"లో మేజిస్ట్రేటురావుగారు. ఈయన మంచివాడని మనకు కనిపించదు, ఎందుకంటే కథ మొదలయ్యేసరికే కొంచెం పిచ్చివాడయిపోయి అమాను

షంగామ యంత్రమంత కఠినంగాను కపిపిస్తారు కాని ఒకప్పుడు వకీలు మూర్తి అంత అమాయకంగాను, "న్యాయం" లో మేజిస్ట్రేటంత దాదస్తంగాను వుండి వుంటాడు. కృత్రిమ జీవితాన్ని - అందులోనూ అమానుషమయిన కృతిమత్వాన్ని - భరించలేక పిచ్చిగాను కఠినంగాను గూడ అయిపోయి వుంటాడు. షలీ పాయీ నరకమూ చీటీ కోర్టూ ముద్దాయిలూ అంతా కలగాపులగమయిపోయి, పాముల్లాంటి సారాట్యూబులూ, ఇరవయి సంవత్సరాలలో ఏడాదికి అరువేల కేసుల చొ॥న ముగించిన వేలాది కేసులలోని ముద్దాయిలూ, ఆయనకు కలలోకి వస్తారు. ప్రతిరోజూ సారాకేసులే, దాదాపుగా అన్నికేసులూ సారాకేసులే. అందరు ముద్దాయిలూ జెయిలుకే "కూలీలు జెయిలుకి, కుష్ఠురోగులు జెయిలుకి, అమాయకులు జెయిలుకి, దరిద్రులు జెయిలుకి, ఆడవాళ్ళు, అనాధలు, అందరూ జెయిలుకి....". 'అర్ధరూపాయి కూల్డబ్బులిచ్చి మొయ్యమన్న' షావుకారుకు కాదు, సారాట్యూబు మోసిన "కాళ్ళ నిండా బురద బురద, వంటినిండా బుగ్గి బుగ్గి, కోకనిండా డాగులు డాగులు, తలనిండా పేలు పేలు, కళ్ళనిండా జడుపు జడుపు" వున్న స్త్రీకి జెయిలు. వీళ్ళంతా కటకటాల వెనక కుళ్ళి కుళ్ళి వుంటారు, తనమీద పగబట్టి వుంటారు, అనుకుంటాడు. అనుకుని పిచ్చివాడయిపోతాడు తన చేతులు త్రాచుల్గాను. వీళ్ళంతా ఆ త్రాచును చంపే పగబట్టిన చలిచీమలగాను కనబడతారు. సిరాలో విషం, కలంలో కాటు కనిపిస్తాయి. పోలీసులకు డబ్బులిచ్చిన షావుకారుకు "బదలా" తాను కేసొప్పుకున్న షావుకారు భృత్యుడికి పిచ్చెక్కిన కోపంలో జరిమానా కడ్తానన్నా వినకుండ జెయిలు శిక్ష వేస్తాడు. చివరికి విచారించకుండానే కొందరికి శిక్ష వేస్తాడు బెంచి గుమాస్తాకూ "ఆర్నెల్లు" వేస్తాడు. ఈతచెట్లకూ తాడిచెట్లకూ వేస్తాడు. వేసి తాను పిచ్చాస్పత్రికి పోతాడు.

మేజిస్ట్రేటులూ వకీళ్ళూ ఈ అబద్ధపు కంపుతో సామరస్యమయినా సాధించాలి. పిచ్చివాళ్ళయినా కావాలి. కాని ఈ 'సేఫ్టీవాల్వు' మరల్లో చిక్కుకున్న పేదలకు మాత్రం "సామరస్యం" ఒక మార్గంకాదు, ఆ దౌర్జన్యాన్ని అనుభవించడమే వీళ్ళకు మార్గం. అందుకే వాళ్ళకు కోర్టులంటే భయం, అసహ్యం. పేదవాళ్ళు రోగానికంటే ఆస్పత్రులకు ఎక్కువ భయపడ్డట్టు నేరానికంటె కోర్టులకు ఎక్కువ భయపడతారు. కళ్ళు లేకకాదు, ఉండీ చూడదల్చుకోని బూర్జువా చట్టానికి అన్యాయం కనపడదు, చట్టాల అతిక్రమణ మాత్రమే కనబడుతుంది, అన్యాయం Cognisable offence కాదు, దాని మీద ప్రతీకారమే Cognisable offence. దాని కళ్ళకు

కాంట్రాక్టు కనబడుతుందే గాని, ఆ కాంట్రాక్టు వెనకున్న మోసాలు కనబడవు. కాంట్రాక్టును అతిక్రమిస్తే పట్టించుకుంటుంది గాని ఆ కాంట్రాక్టే మానవత్వాన్ని అతిక్రమిస్తే దానికి పట్టదు దాసరి బోడికి వాళ్ళ ఊరి ప్రెసిడెంటు '(సొమ్మొలు పోనాయండి) జత పోతుల కొనడానికి నెలకు వందకు పాతిక చొప్పున వడ్డీకి (ఊరి కరణం సాక్షిగా) మూడు వందలు అప్పిచ్చి ఆరువందలకు ప్రోనోటు రాయించు కొని, పోతుల్ని తాను తోలుకుపోయి, ఇచ్చిన వడ్డీ దిగమింగి, మళ్ళీ ప్రోనోటు ప్రకారం ఆరువందలూ చెల్లించమని డిమాండుచేస్తే, ఇదే చట్టానికి కనిపించలేదు గాని, ప్రెసిడెంటు అన్న కొడుకు తన భార్యను అవమానపరిచాడని వాడిమీద చెయ్యి జేసుకున్న బోడిని అర్నెల్లు జైలుకు పంపింది. ప్రోనోటును 'ఆనర్' చెయ్యలేని అతని ఆస్తిని జప్తు చేసింది. ఆ ప్రెసిడెంటు బోడిని లొంగదీసుకునేందుకు చట్టాన్ని వాడుకునే తీరు లోకంలో రివాజే గాని తెలుగు సాహిత్యంలో అపూర్వమ యింది. మొట్ట మొదట అతని ఆస్తిని (ఒక ఎకరా నలభై సెంట్ల బృహత్ జాగీరు) జప్తు చేయిస్తాడు-తనకు రాసియిచ్చిన ప్రోనోటును 'ఆనర్' చేయడేమోనన్నభయం వ్యక్తపరచి, తన అన్న కొడుకును కొట్టారని ఫిర్యాదిచ్చి బోడిగాడి కుటుంబం మీద ఏకంగా అరెస్టు వారంట్లు రాయిస్తాడు మేజిస్ట్రేటు చేత తాలూగా వేరే కాబట్టి తాము తెచ్చిన ఆ స్టిసర్టిఫికేటు చెల్లదని మతిలేని చట్టం ప్రకటిస్తే, కోర్టున్న తాలూగా తాసీల్దారాఫీసు చుట్టూ తిరిగేతే ఓపికలేక, వృత్తి జామీన్‌దార్లకు డబ్బులిచ్చుకొని బయట పడ తారు బోడి, అతని భార్యా, కూతురూ వాయిదా వాయిదాకుకోర్టుచుట్టూ తిరగలేక సత మత మవుతూన్న బోడిమీద, అతని బామ్మర్దిమీద వాళ్ళవల్ల తనకు ప్రాణాపాయ ముందని 'బైండోవరీ' కేసు పెడతాడు ప్రెసిడెంటు. దానికోసం కలెక్టరు క్యాంపెళ్ళిన వూరల్లా వెళ్ళాల్సి వస్తుంది బోడికి, అతని సహచరులకూ. అట్లా తిరగటంలో బోడి కూతురు రాదీం పాలబడి చచ్చిపోతుంది డబ్బుకోసం జగిలీడుకు నలభై సెంట్లభూమి 'ప్రోనోటు రద్దుచేయ'గా, జగిలీడు దగ్గర ఆ ప్రోనోటును 'ట్రాన్స్ఫరీ' చేయిం చుకుని, ఆ నలభై సెంట్లభూమి తనకు అమ్మకపోతే దావా వేస్తానని నోటీసిప్పిస్తాడు ప్రెసిడెంటు జగిలీడు మాత్రం ఏంచేస్తాడు ? కూతురి పెండ్లికి అతనికీ డబ్బు అవ సరం. సాటి పేదవైతని బోడికి ఆసరాగ నిలబడ్డాడేగాని, అది తన పేదరికం పరిధి లోనే చివరికంటా బామ్మర్దిలాగా నిలబడడం అందరికీ సాధ్యంకాదు

ఇంతలో ప్రెసిడెంటు అన్న కొడుకును కొట్టిన కేసులో బోడికి అర్నెల్లు శిక్ష ; వెనకనే 'ప్రోనోటుకేసు' గూడ ఓడిపోతాడు, భూమి డిక్రీ అయిపోతుంది

గత్యంతరం లేక రాజీకి వస్తాడు బోడి. నలభై సెంట్ల పొలాం ప్రెసిడెంటుకు అమ్మడా నికి ఒప్పుకుంటాడు. ఆ నలభై సెంట్లే ప్రెసిడెంటుకు తక్కువయ్యాయని కాదు, అతని రెండు పొలాల మధ్య ఆ భూమివుంది. అందుకే దాన్ని కలిపేసుకోవాలంవే తాపత్రయం. పేదవాడిని లొంగదీసుకోవటానికి బూర్జువాచట్టం సమ్మెటలాంటిసాధనం. దాన్ని పూటుగా వాడుకుంటాడు ప్రెసిడెంటు. ఆ సమ్మెటను మర్యాదగా ఎదుర్కో లేమనీ, తిరిగి దెబ్బతీయటానికి తనకు ఆ సమ్మెట పనికిరాదని, వేరే ఆయుధాలు కావాలనీ బోడి తెలుసుకొనే సరికి చాలాకాలం పడుతుంది. తన సహనం నశించే వరకు, ఆరోగ్యం చెడేవరకు, నెట్టబడిన తిరువాతే ఆ విషయం అర్థమవుతుంది. (ఈ ఒక్క రచనలోనే ననుకుంటాను రావి శాస్త్రి రాజ్యాంగయంత్రపు వర్గ స్వభా వన్ని స్పష్టంగా చూపిస్తాడు).

అందుకే "తలుపుగొళ్ళెం" లోని వృత్తి భిక్షగాడూ (పీలునుబట్టిదొంగా) అయిన పైడిరాజుకు చట్టమూ, కోర్టు అంతా భయంకరంగా కనిపిస్తాయి. జడ్జీలు దుక్కబలసిన గుంటనక్కలలాగా, ప్లీడర్లు చరచర్లాడే త్రాచుల్లాగా, పోలీసులూ కోర్టు సిబ్బందీ పీడించడానికి యముడు పంపిన స్పెషల్ పైపు పిశాచాల్లాగా కనిపిస్తారు. న్యాయస్థానం ఎంత "ఉన్నత"మయినా దాని ఆవరణలో మంచిపూల చెట్లు నాటినా వాటికి విషపుష్పాలే పూస్తాయని, అక్కడ పచ్చటి పూలతీగలు పసరిక పాముల్లా వుంటాయని, అక్కడ మానస సరోవరం వుంటే అది మొసలి గొయ్యిగా తుంటిం చుకు పోతుందని, అక్కడ అమాయకపు చిలకల్ని పెంచితే అవి గద్దలగా ఎదుగు తాయని, అక్కడ ఎవరయినా నవ్వితే అది రాక్షస వృశ్చికాల తోకలతో నవ్వినట్లుం టుందే గాని మనుషుల నవ్వులాగా వుండదని, అనిపిస్తుంది (నిజానికి 'తలుపుగొళ్ళెం' లోని ఆ రెండు పేజీల కోర్టు వర్ణన చాలా అద్భుతమయినది).

ఏమనిపించినా పైడిరాజులాంటి వాళ్ళు చేయగల్గిందేమీలేదు. రాజ్యాంగ యంత్రపు ప్రధాన కర్తవ్యం శ్రామిక వర్గాన్ని అణచడమే గాని, అధో ప్రపంచాన్ని రెగ్యులేట్ చేయడం కాదు. అందుకే ఆ అధో ప్రపంచవాసులు రాజ్యాంగ యంత్రా నికి వ్యతిరేకంగా పోరాటాలు చేయడంగాని, దాన్ని మార్చడంగాని, అసాధ్యం. అటు వంటి కృత్రిమ పోరాటాల్ని చిత్రించక పోవడం రావి శాస్త్రిగో మెచ్చుకో దగ్గ లక్ష ణమే గాని, దుర్భరమైన ఈ జీవన పరిస్థితులను మార్చగల వర్గాల గురించి ఆయన రాయడం అలవర్చుకుంటే బాగుంటుంది. లంపెన్ వర్గాల జీవితాన్ని ఎంతవాస్తవి కంగా చిత్రించినా అది వాస్తవికదృక్పథం అవుతుందేగాని విప్లవ దృక్పథంకాదు.

# 'ఆఖరిదశ' ఎవరికి ?

—కె. వి. రమణారెడ్డి

'తన చావు జగత్ప్రళయము' అని ప్రతిఒకడూ అనుకుంటాడు. ఆ ప్రతి ఒకడూ నేలబారుగా తప్ప ఆలోచించడు. అలాంటివాడు అతిసామాన్యుడు. వాడి చూపు ముక్కును మించి ముందుకి పోదు. వాడి చెయ్యి విసురు మూరెడు కాకుంటే బారెడు. వాడి భావం 'స్వ' ను మీరదు ఒక్కమాటలో, వాడి తత్వం వామనత్వం.

భద్రత కంటె వాడు ఎక్కువేదీ కోరుకోడు. ఉన్నది అలాగే కొనసాగుతూపోతేనే వాడికి మనశ్శాంతి అంటే, తాను జీవిస్తున్నది ఏ వ్యవస్థలోనైనా సరే, ఆ వ్యవస్థ ఎలాంటిదైనా సరే, అది చెక్కుచెదరగూడదని వెయ్యిదేవుళ్ళకు వాడు రోజూ మొక్కుకుంటాడు. అంటే, వాడికి మార్పు సుతరాం సరిపడదన్నమాట 'యథ మూషిక మూషికః' బాపతు మనిషికి ప్రతి పరిణామమూ భయంకరమైన మార్జాలమే

అయితే చరిత్ర ఎవరికోసమూ ఆగేది కాదు. అది జీవనది దానికి వరద వస్తూంటుంది, తీస్తూంటుంది. ఎవడేమి కోరుకున్నాసరే. ఎంతగా మొత్తుకున్నాసరే, అది చూసీచూడనట్టూ వినీవిననట్టూ నిర్మమంగానూ నిశ్చయంగానూ తన నైజాన్నిబట్టి సాగిపోతూనే వుంటుంది. అయితే దానికీ మలుపులుంటాయి. అదీ తన ప్రవాహ దిశను కొద్దిగానైనా మార్చుకుంటూ వుంటుంది.

నది అనేది పోలికకోసం వాడినమాట. చరిత్ర మనుషులకు చెందిన విషయం. ఈ మనుషులే సంఘటితశక్తిగా రూపొందినప్పుడు, తాము జీవిస్తూన్న వ్యవస్థతో ఘర్షించినప్పుడు, చరిత్ర మార్పు చెందుతుంది. అయితే తాము తెలిసి, తెలిసీ ఈ మార్పుని కలిగించవచ్చు. తాము అలా తెలుసుకోలేకపోయినా, వ్యవస్థలో విరుద్ధాంశాల సంఘర్షణ ఫలితంగా మార్పు కలగనూ వచ్చు.

ఎవరెవరైతే ఈ మార్పుకి బుద్ధిపూర్వకంగా అనుకూలత చూపుతారో వాళ్ళే చరిత్ర నిర్మాతలు కాగలుగుతారు. చైతన్యవంతులైన ప్రజలు తమ

చరిత్రను తామే రూపొందించుకుంటారు. అలాగాక, ఉన్నదానితో సరిపెట్టుకునే వాళ్ళు ఏ మార్పునీ సహించలేరు. తమ ఇష్టాయిష్టాలతో ప్రమేయమే లేనట్టుగా వచ్చిపడుతూన్న మార్పు వాళ్ళకు ఎంతో చిత్తక్షోభ కలిగిస్తుంది ఎంచేతనంటే ఉన్న వ్యవస్థ అలాంటి వ్యక్తుల ప్రయోజనాలకు పెట్టనికోట. ఇంగ్లీషులో వీళ్ళను 'వెస్టెడ్ ఇంటరెస్ట్స్' అంటాం.

రా. వి శాస్త్రి కథ 'ఆఖరి దశ' చెప్పక చెప్పేది ఈ విషయాన్నే. నిజానికి ఇది పేరుకే కథ ఇందులో కథాంశ చాలా కొద్ది కొన్నివేల సంవత్సరాల నుంచీ యుగాల నెన్నిటినో దాటుకుని "ప్రపంచం సాగుతూనే ఉంది" అనే భావాన్ని ప్రకటించేందుకే మనదేశ చరిత్రలో కొన్ని ఘట్టాలను ఎంపిక చేయడం జరిగింది. ప్రతిఘట్టమూ ఒక్కొక్క చారిత్రకదశ అంత్యకాలానికే చెందింది. అలాంటి కాలాన్ని 'యుగసంధి' అనడం కద్దు. దీర్ఘకాలికమైన వ్యవస్థే కాదు, దానిలో అంతర్భాగాలైన హ్రస్వదశలు సైతం పరివర్తనకు లోనౌతూన్నప్పుడు, వాటితో తమ జీవన విధానమూ విలువల చట్రమూ ముడిపడిపోయిన మనుషులు ప్రపంచమే అంతరిస్తున్నదని ఆందోళన చెందుతూండటం పరిపాటి. వాళ్ళు గతానుగతికులూ అభివృద్ధి విరోధకులూ.

ఈకథనే తీసుకుంటే నాలుగుతునకలు కనిపిస్తాయి కురుక్షేత్రయుద్ధంతర్వాత ఎక్కడో దూరాన కాశీనగరంలో గంగానది ఒడ్డున తారసిల్లిన దేవదత్తుడూ, చారుదత్తుడూ "మహా ప్రపంచానికే అంత్యకాలం" ఆసన్నమయిందని అనుకుంటారు. ధర్మం నశించిపోతుందని అంటారు. ఆర్యుల విలువలు అంతరించడం అనార్యుల విజృంభణకు దారితీస్తుందని గుండెల్ని చేతబట్టుకుంటారు రెండోతునకలో బౌద్ధ సన్యాసులిద్దరు అద్వైత స్థాపకుడైన శంకరాచార్యుల మూలంగా తమ సంఘాలూ తమ ఆరామాలూ తమ ధర్మాలూ మంట గలిసి పోతున్నాయి గనక, "ప్రపంచం అంతా చివరి దశకు వచ్చినట్టే" నని నీరసంగా నిట్టూరుస్తారు ఔరంగజేబు పాదుషా ఎక్కడో చనిపోయాడనే కబురు వ్యాపించాక ఆగ్రాలో తాజ్‌మహల్ సమీపాన సంపన్నులైన ముస్లిములిద్దరు, ముస్లిం రాజ్యానికి లోపలినుంచీ బైటినుంచీ రాక తప్పని ప్రమాదాల గురించి తలపోసుకుని, "మొగల్ సామ్రాజ్యానికి ఆఖర్రోజులొస్తె మహాప్రపంచానికే ఆఖర్రోజు లొచ్చాయని" లెక్కవేసుకుంటారు. మొగల్ సామ్రాజ్యమే యేం, బ్రిటిష్ సామ్రాజ్యంలో ఎంతో విలువైన భారత

దేశం తమ చెయి జారిపోతున్నదని భ్రమపడి, లేని భయాన్ని కలిగించుకున్న యిద్దరు యింగ్లీషువాళ్ళు కలకత్తాలో ఒక క్లబ్ వరాండాలో కూర్చుని, "మాస్తూ వుంచే ప్రపంచానికి ఆఖరిదశ సమీపించినట్టుంది" అనుకుంటారు.

రెండో ఘంటలో ఉపాలి, ఆనందుల పేర్లకూ శంకరాచార్యుల కాలానికీ పొంతన కుదరదని రచయిత గ్రహించి వుండాల్సింది. ఆ ఇద్దరూ శంకరాచార్యుల కంటె చాలా చాలా వెనకటివాళ్ళు. మిగిలిన కథావ్యక్తుల పేర్లతో యేపేచీ లేదు. అలాంటివి ఎప్పుడైనా ఎక్కడైనా వాడుకలో వుండేవే. వాటికి చారిత్రక యధార్థత లేదు గనక వాటిని అంతగా పట్టించుకోము.

మామూలు కథకుల కోవకు చెందివుంటే, రా. వి. శాస్త్రి యిలాంటి కథను రాసివుండరు స్థలం విషయంలో కాలం విషయంలో ఐక్యత ఉందా? ఇతి వృత్తమంటూ నిరంతరాయంగా ఏదైనా ఉందా! కథావ్యక్తుల చర్యాప్రతిచర్య లతో గూడిన సంబంధాల చిత్రణ అంటూ ఒకటి ఉందా? ఇవేవీ లేకుండానే యీ కథను ఎందుకు రాసినట్టు? ప్రచారమే కథకుడి లక్ష్యమని అందామా అంటే, ఏ సిద్ధాంతాన్ని పనిగట్టుకుని స్థాపించింది లేదు. ప్రబోధమే ధ్యేయమని అందామా అంటే, లోకోత్తరమైన ఏ సందేశాన్ని సంకల్పపూర్వకంగా ప్రసాదించింది లేదు. అతి సాధారణమైన ఒకానొక మనస్తత్వాన్ని ప్రదర్శించడానికే సునాయాసం అనిపించేంత ఒడుపుగా ఈ కథను ఇలా రూపొందించడం జరిగింది. ఆ మనస్తత్వం అతిసాధారణం అనిపించినా, బహు విలక్షణమైందిగనకనే కథగాని యీకథకు వింత ఆకర్షణ కలగుతూంది. సలక్షణ మనిపించే కథల మూసను బద్దలుగొట్టిందే, దాని రూపు చెరపందే, సుపరిచితమైన పద్ధతిలో పాత్రలకూ ఘటనలకూ ఇతివృత్తాలకూ అది చెయ్యకతప్పని దాస్యాన్ని పైదొలగి చుందే, యిలాంటి కథలు అపురూపంగా కనిపించే అవకాశం లేదు కొన్ని కథలను కవిత్వమయం చేసినట్టుగానే రా వి శాస్త్రి మరికొన్ని కథలలో తత్వాన్ని మెదిపారు, ఇంకొన్నిటిలో ఒక చిన్న అంశాన్ని చిలకకొయ్యగా వాడుకుని బాహాటంగానూ నిస్సంకోచంగానూ తాను చెప్పదలచిన విషయాన్ని సవిస్తరంగా చెప్పారు. ఈ కథ యిదీకాదు, అదీ కాదు మూడోదీ కాదు. అందుకే ఇది విలక్షణమైనదని రాయడం జరిగింది.

చరిత్రగతి గురించి సమ్యమైన అవగాహనవుంటే తప్ప, ఆ చరిత్రకు కర్తలు కావలసిన మనుషుల నైజం గురించి తెలిసి వుంటే తప్ప, ఏ కథకుడూ

యిలాంటి కథను రాయడం అసాధ్యం. ఈ నాలుగు తుంటల్లోనూ కనిపించే కథా వ్యక్తులు అందరూ మార్పుకి తలవొగ్గేవాళ్ళే గాని, దాన్ని అడ్డుకొనేవాళ్ళుకారు. ఆ మార్పు మంచిదైతే దానికి అనుకూలించాలి, చెడ్డదైతే దాన్ని ఎదుర్కోవాలి. అంతే గాని, జలపాతానికి తలలను అప్పగించి కుయ్యో మొర్రో మన్నట్టుగా, తమ నిమిత్తం ఏదీ లేకుండా వస్తూన్న మార్పుని చూసి గుండెలవిసి, తమకు లాభిస్తూ వచ్చిన వ్యవస్థ నేలరాలిస్తూంటే ప్రపంచానికే కీడు మూడిం దనుకునేవాళ్ళు అల్ప మతులు. వాళ్ళకి, బుద్ధిజ్ఞానమూ లేని మూగజీవాలకి అట్టే తేడా లేదు మదపుటేనుగు చెలరేగి దిమ్మెసెల్లాంటి తన కాళ్ళతో ఎదురైన ప్రతి చక్కటిదాన్నీ తొక్కి వేస్తూంటే కళ్ళప్పగించి చూస్తూన్న నిర్వీర్యులు నీరసత్వానికీ క్రియాశూన్యతకీ ప్రతీకలే గాని, సాహసికత్వానికీ నిర్ధరమైన మనుష్యత్వానికీ ప్రతీకలు కాలేరు. అలా కాగలగడం చారిత్రకంగా వాళ్ళ స్వభావానికే పొసగని విషయం ఇది వ్యక్తిపరమైన స్వభావం మాత్రమే కాదు. వర్గపరంగా కూడా వాళ్ళ స్వభావం భిన్నమైందికాదు. పాలకవర్గంలో తమది ఆధిపత్యస్థానమే కానక్కర్లేదు. అధిపతుల భావజాలానికి తాము కింకరప్రాయులైనా చాలు. పాలకవర్గ భావజాలమే తమ భావజాలంకూడా. భావాలేగాక భౌతికమైన ప్రయోజనాలు కూడా గతిస్తూన్న కాలానికే చెందినందుచేత, వారి శోభకు విషాదరేఖ జతచేరుతూంది. ఇక తమకు మిగిలింది వంపోత ఒక్కటే. చింతతోనే కృశించి నశించక తప్పదు. తమది పోయే కాలం మాత్రమే. అధికారం కోల్పోయే ప్రతి వర్గం కూడా యిలాగే తన అసమ్మతిని నిట్టూర్పు రూపంలో ప్రకటిస్తుంది. చరిత్రది ఎప్పుడూ ముందంజే ప్రపంచానిది ఎప్పుడూ పరిణామశీలమే.

ముందుకు పోతాం మేము
ప్రపంచం మా వెంట వస్తుంది.

అనుకోగలిగింది చరిత్రలో అభ్యుదయాన్ని కోరుకునే వర్గాలకు చెందిన మనుషులే విప్లవాలద్వారా తప్ప చరిత్ర గమనం వేగాన్ని అందుకోదు. విప్లవాలను కోరేదీ విజయవంతం చేసేదీ మనుషులే. ఈ కథలోని మనుషులు ఆ పేరుకే తగరు రా. వి. శాస్త్రి చెప్పదలచిన సంగతి ప్రపంచ చరిత్ర చాటక చాటే సత్యమే.

రా. వి. శాస్త్రి ఆశించిన 67

# విలువలు

— "నమ్మి."

నవ్వుకూడా భయంకరంగా వుంటుంది.

ఒక్కోసారది మనల్నమాంతం మింగేస్తుంటుంది.

మనల్నమ్ముకోడానికి తూచే రాయి లేనప్పుడు త్రాసులోకి దొర్లుతుంటుంది.

నవ్వు ఒకోసారి విలువల వలువల్ని విప్పదీసి నడిబజార్లో వేలం వేస్తుంది.

చుట్టూరా ఆవరించివున్న విషాద మేఘాల్ని లోతుగా పరిశీలిస్తే నవ్వు దాని లోతు తెలీను.

సముద్రం అడుగున బద్దలుకానున్న అగ్నిపర్వతంలో నవ్వుకూడా నిశ్శబ్దంగా వుంటుంది.

ఒకసారి అవయవాల సోమరితనాన్ని మంటలో దగ్ధం చేయడానికి, ఒకసారి నరాల నదుల కట్టలు తెంపి పొంగును సంగమంలో తొక్కేయడానికి, ఒకసారి అహంకారాన్ని ఆరేయడానికి, ఒకసారి మసకకప్పిన కుబుసాన్ని వదిలించుకోడానికి నవ్వుకావాలి.

నల్లటి కురులలోని జాజిమల్లెల వాసనల నవ్వుకావాలి.

పొంగిన వంగిన గీతల నవ్వులు కావాలి.

చీకటికి కాసిన వెన్నెల నవ్వుకావాలి.

ఆడమనిషి వాసనల నవ్వు కావాలి.

కానీ, రూపాయిన్నరే వుంది.

రూపాయి ఎనిమిదణాలు వున్నయ్. అరఘడియ సుఖంకోసం.

వ్యక్తినిబట్టి, సమయాన్నిబట్టి, స్టేటస్‌నిబట్టి, సప్లయ్‌నిబట్టి విలువ హెచ్చే, తగ్గే వ్యవస్థలో ....

రూపాయిన్నర తక్కువాకాదు. ఎక్కువాకాదు.

మనం బజార్లో వది సరకుల్ని చూస్తాం.

కొన్నింటిని బేరమాడుతాం.

నచ్చకుంటే ప్రక్కదుకాణానికి పోతాం.

అక్కడ ఆ వస్తువుని ముట్టుకుంటాం. వాసన చూస్తాం తృప్తికాకుంటే సాంపిల్ రుచిచూస్తాం. నచ్చకుంటే యింకో దుకాణానికి పోతాం అక్కడా యింతే.........

బజార్లో సరకుల ధరల్ని సప్లయ్, గిరాకీలు నిర్ణయిస్తాయని లాభాలు కోరేవాళ్ళ థియరీ. సప్లయ్ ఎక్కువయితే ధర తక్కువయితుంది.

సప్లయ్ తక్కువయితే గిరాకి పెరుగుతుంది. ధరా పెరుగుతుంది.

కానీ, యిక్కడ అంతకంటే అధ్వాన్నం.

ఇక్కడ ధర నిర్ణయానికి ఒక ప్రిన్సిపల్ అంటూ వుండదు.

ఒకసారి "గిలాపెడు గెంజి" దానిధర.

ఒకసారి "రాళ్ళ నెక్లెస్" దానిధర.

జాజిమల్లెల నవ్వుకూడా ధరవుంటుంది.

హృదయమూ, అభిరుచీ, అభిమానమూ, నోరూ, మెదడూ, దృష్టి, వ్యక్తిత్వమూ అన్నీ వున్న నవ్వుకూడానా ధర ?!

నల్లటి కురులకు, తెల్లతామలాటి మల్లెలకూ, వంగని వంపులకూ, మాటలకూ, పాటలకూ — ప్రతిదానికీ ధరే.

మనిషికే మొత్తంగా ధర.

ఆమెవరో తెలీదు. అతనెవరో ఆమె కవసరం లేదు.

అయినా, నవుతుంది కాస్తంత కొంటితనం పులిమి. అంతే.

ఆమె పక్కన కూర్చుంటుంది. రిక్షా కదుల్తుంది.

ఆమెకు ఆకలి తీరుతుంది. అతని ఆకలి తీవ్రమవుతుంది.

ఆమె పొంగుబు చల్లారిపోతయ్ అతని నరాంలో నదులు ఉప్పొంగుతయ్.

ఆమెకు పూట బతుకుకి భరోసా దొరుకుతుంది. అతని కుటుంబం విడిపోతుంది.

ఆమెకు రూపాయిన్నర సంపాదన. అతనికి రూపాయిన్నరే ఖర్చు.

రూపాయిన్నర దేనిధర ? దేనికిధర ?

ఆమె రూపాయిన్నర నవ్వుతో కిరోసిన్ కొనుక్కుంటుంది, బియ్యం కొనుక్కుంటుంది, జాజిమల్లెలు కొనుక్కుంటుంది, ఒక రూపాయిన్నర కొను క్కుంటుది.

బజారు inflation చలికి గురయినా, లాటరీలాగ ఏ వుంగరాల చేయో దొరికినా ఆమె నవ్వుతో రెండ్రూపాయిలు, మూడ్రూపాయిలు యింకా యిట్లానే నాలుగో, ఐదో రూపాయిలు కొంటుంది.

Black market అయిన కిరోసిన్‌లాగా, బియ్యం గింజల్లాగా ఒక సరకుగా ఆమె ధర ఎక్కువవుతుందపుడు. అపుడు రెండూపూటలా తింటుంది. ఆమె జీవితాని కంతే పరమార్థం.

ఆమె జీవితం విలువ అంతే.

ఒక్కోసారి సరకు obselete ఔతుంది. సరకు నాణ్యత, ఉపయోగిత (utility) తరుగుదల కారణంగా మార్కెట్‌లో obselete ఔతుంది. ఆసరకుకు మార్కెట్ పడిపోతుంది ధర తగ్గుతుంది.

ఆమెకూ అంతే. సరకుకూ ఆమెకూ తేడాలేదు.

ఐతే, సరకు ధర నిర్ణయానికి మార్కెట్ సూత్రాలున్నాయ్.

కాని, ఆమె పరిస్థితి ఘోరం. ఏ సూత్రాల్లేని మార్కెట్‌లో ఆమె సరకు! రూపాయిన్నరా దొరకనపుడు, పార్కుగేట్ కానుకునో, సినిమాహాలు గోడల నీడల నిల్చోనో, కోఠీచౌరస్తాలో ఏ షాపుగోడ కానుకునో కడుపులో కాసిన్ని కాఫీ నీళ్ళున్నాలేక, కళ్ళు చక్కెర్లొచ్చి తిరుగుతున్నా, కాళ్ళకింద మట్టి జారి పోతున్నా ఆమె నవ్వాల్సిందే, నవ్వునవ్వులాగుండాలి.

కనీసం రూపాయికోసమో-అర్ధరూపాయి కోసమో- పరాయి వాళ్ని కన్నెత్తి చూసినా కన్నెర్రజేస్తూ, అడుగడుగునా- ఆంక్షలు పెడుతూ, సాధింపులకు గురిచేయబడుతూ, వంటింటికి, పడకటింటికే వ్యాపకాల్ని పరిమితం చేయబడుతూ, కట్టు, బొట్టు ప్రతి కదలికా కట్టుబాటు చేయబడుతూ, స్వేచ్ఛగా షట్టి సంకెళ్ళలో పెరుగుతున్న- ఆమే- ఈదేశం గ్రామాల్లో కన్పిస్తుంది

సీత, అనసూయ, సావిత్రి పాతివ్రత్య పవిత్రకథలు ఆమె చెవుల్లోనూరి పోయబడుతున్నయ్

కులాలు ప్రభుత్వప్రాపకంలో పచ్చగా పందిర్లకెదుగుతున్నయ్.

ఒక కుంట జాగాలాగా స్వంత ఆస్తిగా ఆమె చూడబడుతున్నది. గుంజకు కట్టేయబడిన ఒక అర్థ బానిసలాగా బతుకుతున్నది. పురుషాధిక్యతకూ, భూస్వామ్య సంస్కృతికి బలై, స్త్రీ స్వంత ఆస్తిగా, అర్ధబానిసగా చూడబడుతున్న సంస్కృతి గ్రామాల్లోవుంది.

నగరాల్లో ఆకాశాన్ని తాకే అంతస్థుల్లో, క్లబ్ డిమ్‌లైట్ల మత్తులో ఆమె అవయవాల ఒంపుల్ని, బ్రాందీలాగా, విస్కీలాగా ఒంపుతున్నది. అందచందాల్ని, అంగట్లో పెడుతున్నది.

స్వేచ్ఛ పేర విశృంఖలత్వాన్ని, సమానత్వం పేర అసహజత్వాన్ని అందుకొంటున్నది. కేవలం "షోకేస్‌బొమ్మ' లాగా. శృంగార వస్తువులాగా వాడుకోబడుతున్నది.

అందాల పోటీలు నిర్వహింపబడుతున్నయ్. అందుకుతగ్గ బిరుదులూ కిరీటాలు అందివ్వబడుతున్నయ్.

'మోడలింగ్' వృత్తిగౌరవాన్ని దక్కించుకుంది.

బ్లూఫిలిమ్, సెక్స్‌క్రైంఫిలిమ్స్ — వినోదమయింది.

పోర్నొగ్రఫీ సాహిత్యమయింది.

నవ్వు అమ్మబడుతున్నది.

స్త్రీ శరీరం సరకయ్యింది.

గ్రామాల్లోని ఆ భూసామ్య సంస్కృతి శ్రమజీవులకు బద్ధవిరోధి.

నగరాలలో ఈ సామ్రాజ్యవాద సంస్కృతి శ్రమజీవులకు బద్ధవిరోధి.

ఈ రెండు సంస్కృతుల ఫలితంగా అతి నికృష్ట పీడనకు గురయ్యిందిస్త్రీ

ఈ దుర్మార్గ సంస్కృతిని, నికృష్టమైన విలువల్ని రావిశాస్త్రిగారు చాలా ప్రతిభావంతంగా, "విలువలు" కథలో expose చేసారు.

ఆయనపొట్టిపొట్టి వాక్యాలే గుండెను పోట్లు పొడుస్తాయి.

ఫ్యూడల్ సంస్కృతికి స్త్రీ పురుష సంబంధాలు ఎట్లా అసహజమై పోతున్నాయో, ఒక రూపాయిన్నరకు బజార్లో స్త్రీ శరీరం ఎట్లా అమ్ముడయిపోతున్నదో, ఈ వ్యాపార నాగరికత ఎంత అమానుషమైందో రావిశాస్త్రిగారు యింతచిన్నకథలో ఎన్నో హృదయ విదారకమైన, ఆగ్రహం కలిగించేటటువంటి సన్నివేశాల్ని చదువరుల ముందుకు తెస్తారు.

జానెడు పొట్టకోసం, ఆశయాల్ని, అభిరుచుల్ని అబురుకి తననే అమ్ముకోవాల్సిన దుర్భర పరిస్థితిపై ప్రతీకారంగా-

"నాజాతిని (పురుషజాతినా ?)

తిరుగులేని ఘోర కోపాగ్నికి గురిచేసి
లేక,
కాళ్ళకిందతొక్కి, మట్టితోకలిపి,
లేక,
మంటలో విసిరి భస్మం చేయడానికి
బదులు —
మృదువుగా కావిలించుకొని, పాలిండ్లకు మెత్తగా అన్చుకొని.

తియ్యగా ముద్దులాడింది అంటూ "తారావథాన్ని దాటి"న

స్త్రీ ఔన్నత్యాన్ని కథ ముగింపులో "అతను"పాత్రఆమెనుపైకెత్తుతాడు.

ఆమెది జానెడుపొట్టకోసం, బజార్నపడి తనకితాను మాంసం ముద్దగా రూపాయిన్నర కమ్ముకోవాల్సిన నిస్సహాయత. హీనస్థితి.

మనిషి పరిపూర్ణమైన మనిషిగా, ఆత్మగౌరవంతో సంతృప్తిగా బతక గలిగే వ్యవస్థ కేవలం జాలి, సానుభూతితో సాధించబడేదికాదు

మనిషి "సరుకై", స్త్రీపురుష సంబంధాలు వ్యాపారానికి తగ్గించబడిన దుష్ట సంస్కృతి నిర్మూలన కేవలం దయ,జాలి,సానుభూతులతో సాధించబడేదికాదు.

ఆ పరిస్థితికి కారణమైన "వ్యవస్థ నిర్మూలన" ద్వారాసాధించబడుతుంది.

రెండు తీవ్రమైన పరిస్థితులు ఒకటి— "వ్యక్తిగత ఆస్తిగా", మరోటి విశృంఖలత్వం పేర "ఎవరికీ కానిది" గా అయిన స్త్రీలదుర్భర పరిస్థితి మారి దాని స్థానే కొత్త విలువలు స్థాపించబడాలంటే" ఈ దుర్మార్గ సంస్కృతికి బలై సుఖ శాంతుల్ని కోల్పోయిన స్త్రీ పురుషులిద్దరూ కలిసి ఈ సంస్కృతికి పునాది అయిన మొత్తం వ్యవస్థను సమూలంగా నిర్మూలించేదాకా విశ్రమించవద్దు.

అపుడు

నవ్వుకు జాజిమల్లెల వాసనవస్తుంది.

నవ్వు నవ్వులాగే వుంటుంది.

రావిశాస్త్రిగారు ప్రతిభావంతంగా చెప్పిన ఈ కథ ద్వారా కోరిన ప్రయోజనం "కొత్త విలువల" స్థాపన.

# సంతాపం

ఏలూరు సూర్యారావు రాజమండ్రిలో కమ్యూనిస్టు ఉద్యమ స్థాపకుల్లో ఒకరు. కమ్యూనిస్టుపార్టీ రివిజనిస్టు పంథా పట్టిన తర్వాత మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ ప్రభావంలోకి వచ్చారు "ప్రజాసమస్యలు" అనే పక్షపత్రిక నడిపారు. 1974-77 మధ్యకాలంలో విప్లవ రచయితలసంఘ సభ్యులుగా ఉన్నారు. భారత - చైనా మిత్రమండలిలోనూ, పౌరహక్కుల ఉద్యమంలోనూ చురుగ్గా పనిచేశారు. ఎమర్జన్సీలో జైలుజీవితాన్ని గడిపారు. సూర్యారావు మరణానికి ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నాము.

త్రిపురనేని మధుసూదనరావు

కార్యదర్శి,

విప్లవ రచయితల సంఘం.

73

# కమ్యూనిస్టు రచయిత రా. వి. శాస్త్రి

—పినాకపాణి

కమ్యూనిస్టు రచయిత అంటే మనకు గోర్కీ, మయకోవ్‌స్కీ, లూషన్, శ్రీశ్రీ గుర్తుకు వస్తారు. వీళ్ళు కమ్యూనిస్టు రచయితలని ఎందుకంటున్నారు? మిగతా రచయితల నుంచి వీళ్ళని వేరుపర్చేది ఏది? ఒక సైద్ధాంతిక నిర్వచనం ఇచ్చుకొని దాని పరిధిలో ఒక రచయిత కమ్యూనిస్టు రచయిత అవునా, కాదా అని పరిశీలించే ముందు, పై ప్రశ్నకి సాధారణ అవగాహనతో సమాధానాలు వెతుక్కుందాం.

పై రచయితల్ని మిగతా రచయితల్నుంచి వేరుపర్చేవి వాళ్ళ అత్యున్నత మానవతా వాదం, శ్రామిక ప్రజల యెడల అకుంఠిత విశ్వాసం, రేపటి మీద అచంచల ఆశావాదం వీళ్ళ మానవతా వాదం ఉదారవాదుల అహింసా వాదంకాదు. బిచ్చగాళ్ళకి పదిపైసలు వేసి వాళ్ళ యెడల జాలిచూపే మానవతావాదం కాదు సమాజాన్ని కృంగదీస్తున్న దారిద్ర్యం, దౌష్ట్యం, మౌఢ్యం మొదలయిన వాటికి మూలకారణమైన వ్యవస్థని తొలగద్రోసి, దాని స్థానే స్వేచ్ఛ, సమానత్వం, చైతన్యం ప్రాతిపదికగా ఉండే నూతన వ్యవస్థ స్థాపనకి దారిచూపే మానవతావాదం. శ్రామిక ప్రజల ఎడల వాళ్ళకున్న విశ్వాసం ఎన్నికల్లో డబ్బులిచ్చి ఓట్లు కొనుక్కునే రాజకీయ చోరుల విశ్వాసంకాదు. శ్రమించే వాళ్ళు తమ జీవితాన్ని మెరుగుపర్చుకోవడంకోసం తరతరాలుగా జరుపుతున్న పోరాటాలనుంచి పొందిన విశ్వాసం వాళ్ళ ఆశావాదం జూదగాళ్ళ ఆశావాదం కాదు చారిత్రక పరిణామం గమనించి మార్క్సిస్టు భావజాలల దృష్టితో పొందిన సమ్యగవగాహన ద్వారా సమాజాలగతిని, గతితార్కికంగా, శాస్త్రీయంగా పరిశీలించడం ద్వారా ఏర్పరచుకొన్న ఆశావాదం పైరచయితల రచనల్లో ఇవన్నీ పుష్కలంగా కనిపిస్తాయి. అందుచేత మనం రావిశాస్త్రిని కమ్యూనిస్టు రచయిత అంటాం కమ్యూనిస్టు రచయిత ఎవరంటే మనం ఇంకోరకంగా కూడా చెప్పవచ్చు. మార్క్సిస్టు భావజాలాన్ని అంగీకరించి ఆ అవగాహనతో తన రచనల్నిచేసే రచయితనీ కమ్యూనిస్టు రచయిత అనవచ్చు. అలాంటి రచనల్లో ఆ భావజాలం ప్రతిఫలించటమే కాకుండా. ఆ రచనలు ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యాల్సిన అవసరం కూడా ఉంది

ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయటం అంటే ఏమిటో ఆలోచించేముందు మార్క్సిస్టు భావజాలం ఏమిటో తెలుసుకోవాలి. ఈ భావజాలంలో కొన్ని ప్రధాన అంశాలు మనం వేరుపర్చి చెప్పవచ్చు. తాత్వికంగా అది స్థితికంటే గతికి అంటే ఉనికి కంటే పరిణామానికి ప్రాధాన్యత నిస్తుంది. వైరుధ్యాల విరోధంలో వాటి ఘర్షణలో కొత్త అంశాలు పుట్టుకొస్తాయని చెప్పుతుంది పరస్పర విరుద్ధ శక్తుల సంఘర్షణ సమైక్యతల్లోంచి, ప్రాకృతిక, సామాజిక పురోగతి నడుస్తుందని చెప్పుతుంది. ఈ అవగాహనలో భాగంగానే, చారిత్రక భౌతిక వాదాన్ని ప్రతిపాదిస్తుంది. ఈ ప్రతిపాదన ప్రకారం "ప్రపంచ చరిత్ర సమస్తం వర్గ పోరాటాల చరిత్ర పీడకుడూ, పీడితుడూ యెల్లప్పుడూ పరస్పర శత్రువులుగా నిలబడి ఒకప్పుడు ప్రచ్ఛన్నంగానూ మరొకప్పుడు బాహాటంగానూ, నిరంతరాయంగా పోరాటం చేస్తూవచ్చారు బూర్జువా వర్గం యే ఆయుధాలతో ఫ్యూడలిజాన్ని నేలకూల్చిందో ఆ ఆయుధాలు యిప్పుడు బూర్జువావర్గం మీదికే ఎక్కుపెట్టబడ్డాయి. కాని బూర్జువావర్గం సృష్టించింది తన్నే నాశనం చేయగల ఆయుధాలను మాత్రమే కాదు. ఆ ఆయుధాలను ధరించే మనుషులను కూడా అది సృష్టించింది, ఆ మనుష్యులే ఆధునిక కార్మికవర్గం........" మధ్య తరగతిలో కింది వర్గంవాళ్ళు కూడా బూర్జువావర్గంతో పోరాడతారు. కానీ వీళ్ళ పోరాటం మధ్య తరగతిలో భాగాలుగానే తాము బతుకుతూ ఉండటానికి, అనగా వీళ్ళు విప్లవకారులు కాదు. యధా స్థితి వాదులు. ఒకవేళ వీళ్ళు ఎప్పుడైనా విప్లవకరంగా ఉన్నారంటే, త్వరలోనే తాము కార్మిక వర్గంలో కలిసిపోతామన్న దృష్టితోనే అలా వుంటారు. అనగా వీళ్ళు తమ ప్రస్తుత ప్రయోజనాల కొఱకుకాక, భవిష్యత్ ప్రయోజనాల కొఱకు పోరాడతారు" (కొటేషన్లలోని భాగాలు రాచమల్లు రామచంద్రారెడ్డి 'కమ్యూనిస్టు ప్రణాళిక' అనువాదం నుంచి).

మార్క్సిస్టు భావజాలంలో మరో మూడు ప్రధానాంశాలు ఉన్నాయి. అవి ఇవి.

1 బూర్జువా సమాజంలో జరిగే దోపిడీని వివరించడానికి అదనపు విలువ సిద్ధాంతం వుపయోగపడుతుంది. కార్మికుడు తనకు లభించే కూలికన్నా ఎక్కువ విలువగల సరకుల్ని సృష్టిస్తాడు. ఆ విధంగా వెలువడే అదనపు విలువనుంచే లాభాలు, వడ్డీలు, అద్దెలు మొదలయిన ఆదాయాలన్నీ జనిస్తాయి.

2 బూర్జువా సమాజంలో ఆర్థిక సంబంధాల పునాదిమీద మానవ సంబం

ధాల, ఆలోచనల, సంస్కృతుల, నాగరికతల ఉపరితలం నిలిచివుంది. ఈ పునాది ఉపరితలం ఒకదానినొకటి ప్రభావితం చేసికొంటూ ఉంటాయి. ఇందులో ప్రధానంగా ఆర్థిక పునాది ప్రభావం ఎక్కువగావున్నా, కొన్ని సందర్భాల్లో ఉపరితలం తన ప్రభావాన్ని ప్రధానంగా నెరవచ్చు.

3. బూర్జువా సమాజంలో గడచిపోయిన ఫ్యూడల్ విలువలస్థానే కొత్త విలువలు పుట్టుకొస్తాయి. ఈ విలువల్లో అతి ముఖ్యమైన విలువ 'డబ్బు' మార్క్స్ మాటల్లో 'బూర్జువావర్గం మనిషి విలువను రూపాయల్లోకి మారుస్తుంది. శాసనాలు ప్రసాదించిన అసంఖ్యాకమైన సుస్థిర స్వాతంత్ర్యాలనుఅంతమొందించి వాటికిబదులు వ్యాపార స్వాతంత్ర్యాన్ని నెలకొల్పుతుంది వైద్యులనూ, న్యాయవాదులనూ, కవులనూ, శాస్త్రవేత్తలనూ, అది తన కింద కూలిపని చేసే నౌకర్లుగా మార్చివేస్తుంది. కుటుంబ వ్యవస్థమీద వున్న మమకారాల మేలిముసుగును చించిపారవేసి, కుటుంబ సంబంధాలను కేవలం ఆర్థిక సంబంధాలుగా దిగజార్చివేస్తుంది.

ఈ అవగాహనతో రావి శాస్త్రి తన రచనల్లో మార్క్సిస్టు భావజాలాన్ని ఎంతవరకు ప్రతిఫలించింది, ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయటానికి ఎంతవరకూ కృషిచేసిందీ పరిశీలిద్దాం ఈ పరిశీలనకు ముందు ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యటమంటే ఏమిటో కూడా తెలుసుకోవాలి. ఈనాటి సమాజ వ్యవస్థలోని అన్యాయాల్ని ఆక్రమాల్ని వాటికి మూలమైన ఆర్థిక కారణాల్ని తెలుసుకొని, ఈ వ్యవస్థని ధ్వంసం చేసి. ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగం, దోపిడీ లేని నూతన వ్యవస్థా సంస్థాపనకి పోరాటం నెరపటానికి ప్రజలు సంసిద్ధులయినపుడు వాళ్ళు చైతన్యవంతులయ్యారని చెప్పవచ్చు తమ స్వంత అనుభవంతో, సమాజాన్ని నడుపుతున్న శక్తులే వాటిని ఎదిర్కొని నూతన సమాజంలోకి దారితీస్తున్న శక్తులని అనే విషయాన్ని ప్రజలు తెలుసుకోగలుగుతారు అయితే వాళ్ళ అనుభవానికి రచయిత తన రచనలద్వారా సామాజిక విశ్లేషణని జోడించి, సమాజం ఏదిశగా పయనిస్తూందీ, ఎవరెవరు కలవాలి, ఏ విధంగా పోరాడాలి, అంతిమవిజయం ప్రజలకే ఎందుకు చెందుతుందో తెలియజెప్పినపుడు ప్రజాచైతన్యాన్ని త్వరితం చేయగల్గుతాడు. ఈ చెప్పటం రెండురకాలుగా జరుగుతుంది. యదార్థాలన్ని గుదిగుచ్చుతూ ప్రజాపోరాటాల్ని focusలో తీసుకురావడం ద్వారా చేయవచ్చు. గోర్కీ 'అమ్మ' లో ఈ పద్ధతినే అనుసరించాడు. లేదా వ్యంగ్య రచనలద్వారా ఈనాటి సమాజాన్ని తీవ్ర అపహాసన చేయటంద్వారా

ప్రజల్లో ఈ సమాజంమీద విశ్వాసాన్ని పోగొట్టి, నూతన సమాజంపైపు దృష్టి సారించేటట్లు చెయ్యటం రెండవ పద్ధతి. రావి శాస్త్రి ప్రధానంగా వ్యంగ్య రచయిత. ఈనాటి సమాజంమీద, ఈ సమాజానికి ఆయువుపట్లయిన దోపిడీవారు, పోలీసులు కోర్టులు మొదలగు వాటిమీద అత్యంత నిశితమైన అపహాసన తన రచనల్లో కురిపించాడు. ఆయనకి సామాజిక సమస్యల విషయంలో తాటస్థ్యం పనికిరాదని తెలుసు. అందు చేతనే ఆయన పీడితుల పక్షం చేరాడు అయితే ప్రభుత్వం ఆయనకి వ్యతిరేక పక్షాన్న వుంటుంది ఎందుచేత?

"మోసం" కథలో రాకెట్ అప్పారావు మాటల్లో "గవర్నమెంటంటేఏటి? నోట్లు గవుర్నమెంటంటే మనకి పోలీసోడు మన పల్లెటూళ్ళంట మున్సబు, కరణాలు, పైకెల్తె తాశీల్దార్, కలెక్టరు. ఇంకా పైకెళ్ళి గవుర్నమెంటేటవి జూస్తేఎమ్మెల్యేనెంబరు. ఆదిపై మినిస్ట్రి, అసలు సంగతదీ ఈళ్ళందరూ గవుర్నమెంటు. అంచేత ఆళ్ళ అడ్డు మనకి నేకుండా ఉండాలంటే ఆళ్ళని మనమే డబ్బెట్టి విం బెట్టాల. లేకపోతే ఆళ్ళని కొనాల. అంటే డబ్బున్న పెద్దపెద్దమాయగోళ్ళు. అసలు గవుర్నమెంటు ఆళ్ళ ఈళ్ళందర్ని కొనుక్కు విలబెట్టుతున్నారు" పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని మోసాన్ని ఇంతకంటే ఎవరూ బాగా వర్ణించలేదు ఈ మోసం హర్యానా సంఘటన ద్వారా ప్రజలకి మరింతబాగా అర్ధమౌతుంది.

వర్గ పోరాటాలమీద ఆయన కథల్లో ఎన్నో ప్రస్తావనలున్నాయి.

"కష్టజీవులు కష్టపడాలి, సుఖభోగులు సుఖించాలి" (పిపీలికం)

"మనపంటలు మనవి కావు, మన పొలాలు మనవికావు. మన రెక్కల కష్టం మన్ది కాదు మన పిల్లల పేణాలు మనయికావు. మన బతుకులే మనయికావు". (అగ్గిపుల్ల)

"జెయిళ్ళన్నీ అభాగ్యులకీ, దౌర్భాగ్యులకీ, దరిద్రులకే. అమాయకపు వెధవలకే జెయిళ్ళు, నరకాలూనూ" (మోక్షం)

'పని కూలీ పెరపల్డి – లాభం బుగతల్ది ఏమైనా అంటే ఎదురుతిరిగితే మన సాయానికి కోర్టులున్నాయి, జెయిళ్ళున్నాయి' (మాయ)

ఈనాడు దేశంలో ప్రధానంగా ప్రచారంలో ఉన్న విలువ "డబ్బు". 'మాయ' కథలో నూకాలమ్మ మాటల్లో "ఈ నోకంల డబ్బు యాపారం తప్ప

మరోట్నేదు.... డబ్బుకోసం నోకం నోగరంతా పడదుకొంటోంది, డబ్బుకి నాను సారా అమ్ముతున్నాను. డబ్బుకి సదివిన సదువంతా నువ్వమ్ముతున్నావు. డబ్బుకి పోలీసోళ్ళు నాయేన్నమ్ముతున్నారు. మందుకొసరం పెద్దాసుపత్రికెళ్తే అక్కడ మందులమ్ముతున్నారు. మంచాలమ్ముతున్నారు. లంజెలు రోడ్లంట, రిచ్చాలెంట, కార్లంటా తిరిగి ఒళ్ళమ్ముకుంటున్నారు. గుళ్ళోకెళ్ళి కొబ్బరికాయ సెక్కా, కాన్డబ్బూ యిస్తే ఆదేవుడిదయే అమ్ముతున్నారు వోట్లొస్తే నువ్వూ, నానూ, ఈబాబూ అందరం అమ్ముడయిపోతున్నాం. అమ్మకం! అమ్మకం; అమ్మకం! అమ్మకం తప్ప మరేట్నేదీ లోకంలో. నాను సదూకోనేదుగాని చూసిన సత్తెం మాత్తరం అది. తప్పయితే తిప్పిచెప్పు! ఇంటాను."

తప్పని ఏసామాజిక శాస్త్రవేత్త కూడా అనలేడు. 'లోకంలో పాప పుణ్యాలు లేవు, లాభనష్టాలే ఉన్నాయి ' (షణ్యం)

'వాళ్ళకి పనికివచ్చే తెలివితేటలు నాకుమాత్రం ఇచ్చేడు భగవంతుడు. దాని ఖరీదు ఇంత అని కట్టిపుంచాను. అందులో తప్పేవుంది చిన్నారీ?'
(తప్పుకథలో లాయర్)

'నాకు దేముడు ఓ రకం శక్తి యిచ్చేడు. ఆ శక్తిని నాయిష్టం వచ్చినంత ఖరీదుకి నాయిష్టం వచ్చిన వాళ్ళకి అమ్ముతాను. ఇందులో అన్యాయం, అధర్మం అటువంటివేమీ లేవు! (అదే కథలో డాక్టర్)

"సాయంకాలం కోవెల్లోకెళ్ళి ఓ కొబ్బరికాయ కొట్టేస్తాను లాభిస్తే లాభిస్తుంది. లేకపోతేలేదు దేముడికో దండం పారేస్తే నష్టమేం లేదుకదా.

ప్రజల్లో దేవుడిమీద ఉన్న నమ్మకాన్ని వీళ్ళంతా ఎలా Cash చేసుకొంటున్నారో పై వ్యాఖ్యల్నించి తెలుసుకోవచ్చు అందుకే మార్క్స్ మతాన్ని నల్లమందుగా వర్ణించాడు.

ఆదనపు విలువ మీద శాస్త్రిగారు "బల్లచెక్క" కథ రాశారు. ఆకథలో సారం ఈ మాటల్లో చెప్పుకోవచ్చు. సత్యమూర్తి తొడుక్కున్న బనీను చెమటతో బాగా తడిసిపోయింది. పంట్లాం మీదకూడా చెమట బొట్లు ఇంకుతున్నాయి.

..."నా కష్టవేఁ మీలాభం కదా మావాఁ? ఒహడు నష్టపోతేనే ఇంకొకడికి లాభం" కష్టపడ్డవాడు నష్టపోతేనే మిగతావాళ్ళకి లాభాలు' (సత్యమూర్తి)

ఈ మాటలలో చెమట, శ్రమ సంపదని సృష్టించడమేకాకుండా లాభాల్ని సృష్టిస్తుందని, అందుకోసం కష్టపడేవాడు నష్టపోతున్నాడని విశదం అవుతుంది

ఇదే విషయం మీద మరో కథ "పాతదే కథ". అందులో భూ కామందు తన వ్యాపారపు కొడుకులకి ఇలా ఉద్బోధ చేస్తాడు.

"మనం బాగు పడాలంటే కూలివాండ్రు చావనూ చావకూడదు బతకనూ బతకకూడదు వారు చస్తే మనకి ఎట్టి లాభమును సంపాదించే అవకాశమున్నూ ఉండదు కనుక లాభములకు కొంత నష్టము కలిగిననూ వారిని మనము కొంత వరకు కొన ఊపిరితో వుంచవలెను ! (మార్క్సు చెప్పిన Subsistence wages).

...కూలీ జనులకు జ్ఞానమార్గములన్నీ బంద్ చేయుడి ! వెక్కు సినిమాలు చూపించండి ! సురాపానము చేయించండి. కాని జ్ఞానదీపాలు వారు వెలిగించుకోకుండా మాత్రం మీరు బహు పరాగ్గా ఉండండి."

ప్రజలలో చైతన్యం రాకుండా ఉండటానికి ఈనాడు పాలక వర్గాలు పై పద్ధతులన్నీ అనుసరిస్తున్నాయి. ఈ విషయం ప్రజల దృష్టికి వివరంగా తీసుకు పోవలసిన బాధ్యత విరసం మీద ఉంది. అదే కథలో శాస్త్రిగారు ఇలాఅంటారు.

"ఎండు కూలీలంతా ఎండలోనే ఉన్నారు. భూ కామందుల వ్యాపారపు కొడుకులు లాభాల వేటలలో ఇంకా ఈలోకంలోనే మన పీకల మీదే ఉన్నారు. కథ కంచికి ఇంకా వెళ్ళలేదు"

కథ కంచికి ఎప్పుడు వెళ్ళుతుంది ?

"నువ్వు చెప్పిన న్యాయం భగవన్నాయమైనాసరే అది అన్యాయంకాబట్టి దాన్ని మేం మారుస్తాం అని "పిపీలికం"లోలా పీడితులు ప్రతిన చేసినప్పుడు "శిక్షాధికార్ల మంచితనం లక్షాధికార్ల సెక్యూరిటీ"కాకుండా పోయినప్పుడు (అగ్గిపుల్ల)

"షణ్యం వర్థిల్లినపుడు (పుణ్యం). పుణ్యం ఎప్పుడు వర్థిల్లుతుంది ?

అలాంటి వాళ్ల (తెలివితక్కువ ముండ, వెర్రివెంగళప్పలు) లోకంలో కోటానుకోట్లున్నారు. అందుకే నువ్వూ, నేనూ మొరిగేస్తున్నాం, కాని యెల్లకాలం వాళ్ళు అలావెంగళప్పల్లా వుండిపోరు. యెప్పుడో అప్పుడు, ఏదోరోజున వాళ్ళందరూ

ఒక్కసారిగా గప్పున తెలివి తెచ్చుకుంటారు. వాళ్ళు తెలివి తెచ్చుకుంటే నువ్వూ నేనూ నీలాంటివాళ్ళం, నాలాంటి వాళ్ళం అంతాకూడా జాగ్రత్తగా వుండాలి ఎంచేత జాగ్రత్తగా వుండాలో తెలుసా ? అప్పుడు ప్రళయం వర్షిల్లుతుంది."

"అరటితొక్క"లో కుర్రటీచరు ఇలా అంటాడు : "మనకి కళ్ళు కప్పి నోరుమూపి చవజంపి రాళ్ళ బండగానుగులన్నీ మనచేత బలవంతంగా తిప్పిస్తున్నారు. ఎవరు తిప్పిస్తున్నారు ? ఎవరో మీకు తెలుసు. కాని ఇందులోంచి మనం బైటపడాలి. బైటపడతాం. కాని బైట పడాలంటే మనకి పట్టుదలా, ధైర్యం రెండూ ఉండాలి. మనక్కావలసింది బతుకు. బతుకు, బతుకు! మంచి బతుకు మనకి కావాలి. ఈచీకట్లోంచి, ఈ ముసురులోంచి, ఈ దుర్గంధంలోంచి మనం బైట పడతాం! మనకి లేదు, లేదుచావులేదంటే లేదు.

సాదామనుషులందరికీ మంచిజీవితం ముందుకి తప్పక ఉందనీ, దాని కోసం అంతాకలిసి పోరాడాలనీ అతను రోజూ వేసే కేకల సారాంశం.

ఒక మనిషి రోజూవేసే కేకలు, లక్షల గళాలు గర్జించే నినాదాల్లా మారాలనీ, నినాదాల ఫిరంగులు పేలి నేటి వ్యవస్థ సమూలంగా కూలిపోవాలనీ కృషి చేస్తున్న కుర్రటీచర్లకి రావిశాస్త్రి గారి వత్తాసు ఆయన రచనల ద్వారా ఎప్పుడూ ఉంటుంది.

ఈ సందర్భంలో మరోవిషయాన్ని ప్రస్తావించకుండా ఉంటే ఈ పరిశీలన అసమగ్రంగా ఉండిపోతుంది. అది ఇటీవలి కాలంలో ఆయన రచనల్లో అత్యంత ప్రముఖంగా ముందుకు వస్తున Lumpen proletariat. Lumpen proletariat సమాజంలో భాగంగా రచనల్లో ప్రవేశించవచ్చు కాని అవి రచనల్లో focus లో ఉండజాలదు కమ్యూనిస్టు రచయిత తనరచన్లో శ్రామికుల్ని, వాళ్ళ పోరాటాల్ని focus లో ఉంచుతాడు. Lumpen proletariat గురించి మార్క్స్, ఎంగెల్స్‌లు కమ్యూనిస్టు ప్రణాళికలో చెప్పిన మాటలు ఈ సందర్భంలో మననం చేసుకోవచ్చు.

"Lumpen proletariat సమాజ ప్రవాహం మీదతెట్టె-పాత సమాజ ప్రవాహపు అట్టడుగు పొరలనుండి వెల్లగక్కబడి ఒడ్డున నిర్జీవంగా కుళ్ళిపోతున్న పదార్థం- అక్కడక్కడా కార్మిక విప్లవంవల్ల మళ్ళీ సమాజ ప్రవాహంలోకి కొట్టుక

రావచ్చుకానీ దాని జీవిత విధానాన్ని బట్టి అసర్గం ప్రగతి నిరోధకులనుంచిలంచాలు తిని వాళ్ళ కుతంత్రాలు నెరవేర్చే కూలిదండుగా వుండడానికి యెక్కువ అవకాశాలు ఉన్నాయి."

ఈ వాక్యాలు Lumpen proletariat స్వభావాన్ని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. అలాంటి వర్గాన్ని focus లోకి తీసుకురావటంగాని, glamorise చెయ్యటం కాని చేయకుండా, దాని ప్రమాదకర పాత్రని బహిర్గతం చేయవలసి ఉంటుంది. అలాకాకపోతే. "కన్యాశుల్కం"లో గిరీశం పాత్రని glamorise చెయ్యటంద్వారా ఆ నాటకంలోని seriousness ని దిగజార్చివేసినట్లు, రచన ప్రధానోద్దేశం దెబ్బతినే అవకాశం ఉంది.

ఇటీవలి కాలంలో శాస్త్రిగారి కలంనుంచి వచ్చిన రచనల్లో ముఖ్యమైనది "బొమ్మలు పోనాయండి". ఇది శాస్త్రిగారిని కమ్యూనిస్టు రచయితగా మరింతపైకి నిలబెడుతుంది. ఈరచనలో ప్రధాన పాత్ర జీవితంలో జరిగిన ముఖ్య సంఘటనలు పరిసర సమాజాన్ని ప్రభావితం చేస్తాయి. భూస్వామి బంట్లు పేదరైతు భూమిని అక్రమించినప్పుడు ఊరంతా తిరగబడిపోతుంది. మార్క్సిస్టు గతితర్కంలోవ్యక్తి, సమాజం విడివిడిగా ఉండలేవు రెంటిమధ్య పరస్పర ప్రభావం ఉంటుంది. వ్యక్తి జీవితంలో కొన్ని ముఖ్యసంఘటనలు చుట్టు ప్రక్కల సమాజం పైన ప్రభావం వేస్తాయి. అలాగే సమాజంలో వస్తున్న మార్పులు, లేస్తున్న ఉద్యమాలు, నెర్రెలు విచ్చిన నేలపై పడిన నీళ్ళు ఇంకుతూ చుట్టూ విస్తరించినట్లుగా వ్యక్తుల జీవితాల మీద ప్రభావాన్ని వేస్తాయి. ఈ రకమైన అవగాహన ఈ కథలో కనిస్తుంది ఈకథ భూస్వాముల దోపిడీని, దౌర్జన్యాల్ని, అన్యాయాల్ని, అక్రమాల్ని, పోలీసుల,కోర్టుల అధికారుల గ్రామిక వ్యతిరేక వైఖరిని చిత్రించమే కాకుండా ఇవన్నీ గ్రామికుల్ని ఏ మేరకు, ఏ విధంగా జాగృతం చేసిందీ కూడా చిత్రించింది. ఇందులో రచయిత సమాజ పరిస్థితిని విమర్శనాత్మకంగా వర్ణించి అంతటితో ఊరుకోకుండా. ఇంకో అడుగు ముందుకు వెళ్ళి ప్రజలు ఏ విధంగా అంచెలుగా చైతన్యవంతులయిందీ, పోరాటమార్గం పట్టిందీ వర్ణించారు. ఇందులో రచయిత తాత్విక దృష్టి, వర్గ దృక్పథం ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తాయి రావిశాస్త్రి ఇలాంటి సాహిత్యాన్ని మరింతగా సృష్టించి, తెలుగుప్రజల హృదయాలలో విప్లవ సాహిత్యాన్ని, విప్లవ భావాల్ని శాశ్వతంగా పదిల పరుస్తారని ఆశించడం దురాశకాదు

# కాదేదీ కథల కనర్హం

## (రావి శాస్త్రిగారి "ఋక్కులు"పై ఒక వ్యాఖ్య)

—హెచ్చార్కె

కవిత్వానికే కాదు, కథకూడా ఏదీ అనర్హం కాదని చెప్పడానికి రావి శాస్త్రి రాసిన 9 కథలే "ఋక్కులు." కాదేదీ కవిత కనర్హమంటూ, శ్రీ శ్రీ — ఫరెగ్గాంపశల్ అన్నట్టు, పేర్కొన్న కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ, రొట్టెముక్క, అరటితొక్క, బల్లచెక్క, తలుపు గొళ్ళెం, హారతి పళ్ళెం, గుర్రపు కళ్ళెం.... లలో ఒక్కొక్కదాని చుట్టూ ఒక్కో పసందైన కథ అల్లి చూపించారు శాస్త్రిగారు. గుర్రపు కళ్ళెం మీద కథలో కళ్ళెం వదిలేయగా గుర్రం శరవేగంతో పరుగెత్తి "గోవు లొస్తున్నాయి జాగ్రత్త" అనే పునామంతో "ఇంచుమించు నవలకు మించి పెరగడం వలన పాఠకుల సౌకర్యార్థం" వేరే పుస్తకంగా ప్రచురించారు విశాఖపట్నం సాగర గ్రంథమాలవారు అంచేత, మన మిప్పుడు 8 ఋక్కులే చదివి, చర్చించుకుంటున్నాం.

ప్రతిదీ జీవితంలో వున్నదే. జీవితంలో లేనిది తెలీక పోవడమే కాదు. అసలు వునికిలోనే వుండదు. వాసన పట్టగల శక్తుండాలేగాని, ప్రతి వస్తువూ జీవితం వాసనే వేస్తుంది. చేవవున్నవాడు దేనిచుట్టయినా కథలు అల్లుకు పోగలడు, దేన్నయినా ఒక ఆలంబనగా వుపయోగించుకుని బ్రతుకుగురించి తాను చేయదల్చుకున్న వ్యాఖ్యానమే చేయగలడు. అట్లా శాస్త్రిగారు చేసిన వ్యాఖ్యానాలే యీ ఎనిమిది ఋక్కులు.

రావి శాస్త్రిగారు ఎక్కువగా క్షుద్రవర్గానికి (లుంపెన్ ప్రొలిటేరియట్‌కు) చెందిన జనాలగురించే రాస్తుంటారని అంటుంటారు అది నిజమే అని ఋక్కులు చదివాక్కూడా అనిపిస్తుంది. అయితే దానికి అభ్యంతరం ఏమిటి? అట్లా రాయడం నేరమేమీకాదు, నిరుపయోగం కూడా కాదు. ఏ రచయితయినా, తనకు బాగా తెలిసిన జీవితంగురించే రాయడం మంచిది. అట్లా కాకుంటే ఆయనగారు అందమైనవో, వికారమైనవో కొన్ని అబద్ధాలు చెప్ప పోగలడు అట్లాంటి రచనలు న్యూస్‌పేపర్ రిపోర్టుల స్థాయికి దిగజారనూవచ్చు గా - ట్టి సామాజి

జీవితంలో ఎక్కువభాగా న్నాక్రమిస్తున్న యీ జీవన పార్శ్వాన్ని కూడా చిత్రించక పోతే సాహిత్యం సమగ్రం ఎట్లా అవుతుంది? బ్రతుకు మారాలని కేకలేయడం చాలదు. ఎందుకు మారాలో చెప్పి, ఒప్పించాలి. జీవితం యిప్పటికే అధోగతి పాలయ్యింది. ఇది మంచికి మారకపోతే యింకా యింకా కుళ్ళిపోతుంది అని ప్రజలచేత అంగీకరింప జేయలేకపోతే, ప్రజలు జీవన్మరణ పోరాటమైన విప్లవా ల్లోనికి రాక తప్పని అనివార్య అవసరాన్ని గుర్తించరు యథాతథ స్థితిపై భ్రమలూ పోగొట్టాలి, రేపటిగురించి తీవ్రమైన ఆశతో ముందు కురికేట్లూ చేయాలి.

ఇప్పటి జీవితంగురించి, – ముఖ్యం ఫక్తులంపెన్‌గాళ్ళు "సాహిత్య రంగా"న్నేలడం ఎంతో సహజమనేదాన్ని గురించి – శాస్త్రిగారు ఒక "థీరీ" యే చెబుతారు, "కుక్కపిల్ల" కథలో ....

"గిరీశం"గాణ్ణి మీకు బాగా తెలిసుండాలి. గిరీశం అంటే అసలు గిరీశం, "కన్యాశుల్కం"లో పెద్దమనిషి. వాడంత పాప్యులర్ ఫిగరు మన సాహిత్య రంగంలో మరొకడ్లేడు. ఒప్పుకుంటారా? ఎంచేత వాడి ఏకచ్ఛత్రాధిపత్యం యింత కాలంనించీ అలా చలామణీ అయిపోతుం దంటారు? చెప్పగల్రా? అందుగురించి నాదో చిన్న "థీరీ" వుంది. వినండి చెప్తాను.

ఇంగ్లాండు, ఫ్రాన్సు, మరేమో డచ్చి, అమెరికా, జర్మనీ వగైరా అన్ని దేశాలూ తిరిగి చూయిస్ని మెన్టల్‌గా ముదిరిపోయి, సినికలైపోయి చివరికి భార దేశానికి షిప్పులోంచి కొత్తగా దిగిన ఫక్తు బూర్జువాసరకు గిర్రడనే గిరీశంగాడు. దిగినకొత్తలో బేవార్సుగా, రికామీగా వున్నాడు మరి. మరి మారనికాలం కదా అప్పటి కింకా! వాడికింకా సరిగా కాలాన్లేదు ఇప్పు డాస్తులూ, గీస్తులూ సంపా దించుకుని పూటుసది బాగా వేళ్ళు తన్నేసి ఊనదు కూడా దించేశాడు. వాడి గోత్రీకు లంతా ఇప్పుడు నాయకుళ్ళయిపోయి దేశాన్నేలేస్తూవుంటే వాడాపాటి సాహిత్య రంగాన్నేల్లేడా? .... గిరిశంగాడికీ అంతకు ముందున్న ఫ్యూడల్ మనుషులకీ జరిగిన తగువే "కన్యాశుల్కం"లో పెద్ద తగువు, తెలిసిందా?"

"థీరీ" సంగతేమోగాని, ప్రస్తుత సమాజంమీద ఒక చక్కని వ్యాఖ్యాన మిది మన దేశంలోనూ బూర్జువా సంస్కృతి లేదనికాదు. బాగానేవుంది. కాని, అది దేశీయంకాదు. దిగుమతైనది సహజంగా, మొక్కలో భాగంగా ఎదిగిన కొమ్మకాదు అంటుగట్టిన రెమ్మ. మొదట ఫ్యూడల్ సంస్కృతితో తగువుపడినా,

అది మాక్ఫైట్గా తేలిపోయింది. ఫలితంగా దానిలోనూ, దీనిలోనూ వుండే దుర్గుణాల కలయికగా ఏర్పడిన సంకర సంస్కృతి. ఇదే యిప్పుడు "పూటుపడి బాగా వేళ్ళు తన్నేసి ఊడలుకూడా దించేసిన" కుళ్ళు సంస్కృతి కన్యాశుల్కం పోయి వరకట్నం వచ్చినా గిరీశం యిప్పటికి మనమధ్య తిరుగుతున్నట్లే. మనలో్నేలు తున్నట్లే ఎప్పటి కప్పుడు అనిపిస్తూంటుందికదా.

ఇదంటే నీకిష్టం లేకపోవచ్చు. ఇదంటే నీకసహ్యం కావచ్చు. కాని యిది వాస్తవం, నీ సామాజిక శరీరంలో విడదీయరాని భాగం. దీన్ని అవసరమైన ఇంటెన్సిటీతో వ్యక్తీకరించకపోతే, సాహిత్యం సమాజం నాదిని సమగ్రంగా రికార్డు చేయలేదు అలాగని, యీకుళ్ళు సంస్కృతి యథాతథంగా. తీవ్రాతి తీవ్రంగా, దయనీయాతి దయనీయంగా చిత్రించినా అది సమగ్రచిత్రణ కాబోదు ఈసంస్కృతి లోనే, యీకుళ్ళులోనే "బాగు" పడాలనుకుని, ప్రయత్నించేవాళ్ళకు కొదువలేదు. కాని, దీన్ని ఎదిరించి, తమ అయిష్టాన్ని, అసహ్యాన్ని పోరాటంగా భవిష్యత్తుపట్ల అపార విశ్వాసంగా మార్చుకుని జీవన్మరణ పోరాటానికి సిద్ధపడుతున్నవాళ్లకు కూడా కొరతలేదు. ఆసంగతి చెప్పకపోతే, ఆదిశగా ప్రజల్ని వుత్తేజితుల్ని చేయక పోతే సాహిత్యం సమగ్రమూ కాదు; సరైందీ కాదు. ఈ చర్చ కొనసాగించే ముందు, శాస్త్రిగారి మాటలే మరికొన్ని విందాం.

"అయితే_ ఆ పాత వెధవలూ (ఫ్యూడల్ మనుషులు) యీకొత్త వెధవా (లంపెన్ .... గిరీశం) కూడా ఒక్కలాటి వెధవలేనని టెస్టు చేయిస్తే చూపెట్టేసింది మధురవాణి. అప్పుడారంభమైన గిరీశం గాడ్రోజులు ఇంకా యిప్పటికీ వెళ్తున్నాయి. చూసుకోండి. మధురవాణి కింకా మంచిరోజులు రాలేదు అవున్లెండి, దేవికైనా టైమ్ రావాల్లెండి అందుకే అప్పట్లో ఆవిడకి ఏ సరైన దారీ చూపించలేకపోయాడు. సౌజన్యారావు పంతులు.

పంతులుకూడా అట్టే పనికొచ్చే సరుక్కాదని అందుకే లిట్మస్ టెస్టు చేసేసి చూపెట్టేసింది మధురవాణి ... పోన్లెండి...... ఇంతకీ సౌజన్యారా పెటు వంటివాడని మీ ఊహ ? నా అభిప్రాయం చెప్పమంటారా ? అతడు యిప్పుడున్న మన పెద్దపెద్ద నాయకుల్లాటివాడు మార్వాడీ ప్రెస్సుకు పోషలిస్టు సిద్ధాంతాలు బోధపర్చే వాళ్ళాటివాడు .... డాకూగాళ్ళకు గీతాసారం. విదురునీతులూ చెప్తే వాళ్ళంతా మహాత్మాగాంధీలై పోతారుటండీ మీ వెర్రికాని ?" అంటారు శాస్త్రిగారు.

నిజమే, సౌజన్యారావుపంతులవంటివాడే కావొచ్చు మధురవాణికి ఏదారి చూపెట్టి వుండకపోవచ్చు. మరి సముద్రాలుకి ("అగ్గిపుల్ల" కథ) రావి శాస్త్రి చూపించే దారి ఏమిటి? శారదకి, వాళ్ళమ్మకి, వాళ్ళన్నకి చూపించేదారి — చావు కాకుండా- ఏమిటి? తన కష్టాన్ని తన కళ్ళముందే లాభంగా మార్చేసుకున్న మామను చూసి. ఏమీ కోప్పడక పోగా అదే "దుష్టనవ్వు" ముఖంమీద వెలిగిన సత్యమూర్తికి. తండ్రీ, బావలిద్దరూ యిట్లా కనపడడం చూసి బేజారెత్తిన పార్వతికి శాస్త్రిగారేం దారిచూపారు. ప్రేమగా పెంచిన లిల్లీ, తండ్రీ వ్యవస్థ సుడిగుండాల్లో కొట్టుకుపోగా ఆవేదన చెందిన పైడిరాజుకు. తాముకూడా యీ దుర్"న్యాయవ్యవస్థ"ను అలంబన చేసుకుని బాగుపడమని కాకుండా, శాస్త్రిగారు చూపిన వేరే దారి ఏమిటి?

తన కష్టం నుంచి, ఆవేదన నుంచి ఒకదారి వుందని మధురవాణికీ, పూర్ణమ్మకూ తెలియడానికి అవాళ ఏమైనా అవకాశం వుండిఉండా లేదా, అప్పుడే అత్తరువాత చర్చించుకోవచ్చు, గాని, సముద్రాలుకి, పార్వతికి, శారదకి, సత్యమూర్తికి అలాంటి అవకాశం లేదా? ఇక్కడే మనం ముక్కలు రాసిన రావి శాస్త్రిని "విమర్శనాత్మక వాది"గా గుర్తించి జాగ్రత్త పడాల్సొస్తుంది.

ఇంత పెద్దమాట అనేస్తున్నాను. గనుక, మీరు సొంతంగా చదివేలోగా మచ్చుకి మూడు కథలు సంక్షిప్తంగా చర్చిద్దాం "అగ్గిపుల్ల" కథే వుంది పట్నం నుండి పల్లెకొచ్చిన శేషగిరి డాబూ. దర్పమూ, తెగటని కండదేరిన అందమూ చూసి మోజుపడి తననుతాను వుట్టిషణ్ణానికి అర్పించుకుంటుంది సముద్రాలు. చాల్రోజుల తర్వాత అదే వూరికి అంతే డాబూ దర్పంగా వస్తాడు శేషగిరి. కాని అంత అందంగా వుండిన సముద్రాలు ఎండిపోయి, చీకిపోయి వుంటుంది. ఆఖర్న పొయ్యిలో ఒరిగిపోయి, మాడిపోయి. చచ్చిపోతుంది. ఈ కథ చదివాక నాకు నేను ఒక ప్రశ్న వేసుకున్నాను జీవితం యింతే అయితే; యీ హిపోక్రసీ. యీ దరిద్రం యీ చావు- జీవితం యిదే అయితే బ్రతకడం అవసరమా అని బ్రతకాల్సిన అవసరంగానీ, బ్రతకాలనే ఆశ గానీ నాకేం కనిపించలేదు. జీవితం కూడా నిజంగా "యింతే" అయితే, బ్రతకడం కేవలం అనవసరానవసరం.

"బల్లచెక్క" అని మరోకథ. "లాభం" అంటే వృత్తి కూడికలూ, తీసివేతలూ కాదనీ, శ్రమజీవి శ్రమలోంచి చాలా భాగాన్ని పెట్టుబడిదారుడు కొట్టేయ

దమే లాభం అనీ యీ కథ నిరూపిస్తుంది. "అదనపు విలువ" సిద్ధాంతాన్ని చక్కని కథగా చెబుతారు శాస్త్రిగారు. అయితే చేసిందేమిటీ? ఇట్లా జరుగుతోంది. ఇట్లా జరగడం బాగుండలేదు. కాని, యిట్లాగే జరుగుతోంది అని బ్రతుకు గురించి ఒక యథాతథ వ్యాఖ్యానం చేస్తుంది కథ. చివరకు కష్టం తప్ప చేతిలో ఏమీ లేని సత్యమూర్తి లాభం ప్రలోభంలో పడతాడు. ఈకథలో మనం పార్వతిపాత్రలో వుంటాం. కష్టం కొట్టేసిన కాంతయ్య, కష్టం చేసిన సత్యమూర్తి- యిద్దరి ముఖాల్లోనూ "దుష్టునవ్వు" పాకడం చూసి, "ఆ రాత్రి అతి జాలిగా భగవంతుణ్ని ప్రార్థించి నిద్రపో"తాం మనం. (మనమంటే పార్వతి).

"కలుషగోళ్ళెం" కథలో తనను పెంచిన తల్లీ, తండ్రీ యీ దుర "న్యాయవ్యవస్థ"కు దీనాతిదీనంగా బలై పోవటం చూసి తీవ్ర వేదన చెందే పైడిరాజు తాను కూడా అదే మార్గం అవలంబించి బాగుపడతాడు. మొత్తంగా బుక్కులు చదువుతుంటే తీవ్రమైన నిరాశ వేస్తుంది. ఈ దుష్ట వ్యవస్థ కాకుండా మరొకటి మంచిది వుంటుందనే ఆశకూడా కలగదు. ఆయన ఎట్లా, ఎంత బలంగా, ఎంత సహజంగా చెబుతారంటే, యిదంతా యిట్లా వుండడం అత్యంత సహజంగా, ఇనెవిటబుల్‌గా కనిపిస్తుంది.

నువ్వు పైకి రాదల్చుకుంటే, సుఖపడదల్చుకుంటే అన్ని స్క్రూపుల్స్ వదిలేయ్. ఏ చెయ్యడానికీ వెనుదీయకు, వచ్చిన ప్రతి అవకాశాన్ని నీ దుస్వార్థానికి, నీ "లాభా"నికి నిర్దాక్షిణ్యంగా వాడుకోమంటుంది బూర్జువానీతి. అన్ని నీతి నియమాలకు సమాధికట్టి లాభాపేక్ష, లాభార్జనం ఏకైకం చేసింది బూర్జువానీతి. ఈ సత్యం మనిషిమందు విశ్వరూపం ధరించి ప్రత్యక్షమౌతుంది రావి శాస్త్రిగారి కథల్లో. ఈ దుర్మార్గాన్ని గొప్పగా డిసెక్ట్ చేసి ఎక్స్‌పోజు చేశారు శాస్త్రిగారు కాని. ఇది ఎంత విశ్వవ్యాప్తంగా, ఎంతబలంగా, ఎంత ఇనెవిటబుల్‌గా కనిపిస్తుందంటే దీని క్రింద నలిగిపోయేవాళ్ళకు, దీన్ని అసహ్యించుకొనే వాళ్ళకు తీవ్రక్రోధం, వుక్రోషం మాత్రమే మిగులుతుంది. అదీ నిస్సహాయమైన క్రోధం. "రొట్టెముక్క" కథలో తన కష్టాల కథ వినిపించిన పొట్టికతల కవి యీ సమాజం "మారాలి. ఎప్పుడో ఎప్పుడోకాదు, యిప్పుడే మారాలి" అంటూంటే దానిలో ఏదో ఫ్రస్ట్రేషన్ మాత్రమే ధ్వనిస్తుంది తప్ప- అతని మాటల్లో విశ్వాసం కలగదు పక్కనున్న లంపెన్‌గాళ్ళ సహజత్వం, బలం యితని మాటల్ని ముంచేస్తాయి.

ఈ మొత్తం కథల్లో "అరటితొక్క" ఒక్కటే బ్రతుకుమీద విశ్వాసం కలిగించే కథ. కానీ, అరటి తొక్కవల్ల కూడా కొంత వుపయోగం వుంది, కష్టాలు తప్పవుగా. బ్రతకాలి మరి– అనే సామాన్య భావనను మించి కథ విస్తరించదు. మనుషులలో సహజంగా వుండే దయాగుణం "సబ్బులిళ్ళ" కథలో వ్యక్తమవుతుంది కాని, శశి ఏడ్వడం బిచ్చగాళ్ళ పట్ల ప్రేమతోనా? లేక తాను ఆటగా చేసింది చేయి పీయలేదనే వుక్రోషంతోనా, ఎందుకు?

అయితే, రచయిత ప్రతి కథనూ– ఎంత కృతకంగానైనా సరే– ఏదో తిరుగుబాటుతో, పోరాటంతో ముగించి తీరాలా? ఉపన్యాసా లివ్వాలా? వినాదం, పోస్టర్ సంటి కేవల వివాద స్థాయిలో మిగిలిపోవాలా? అని ఎవరేనా ప్రశ్నించ వచ్చు.

లేదు అట్లా అవసరంలేదు జీవితంలో లేని పోరాటం చెప్పమంటే కదా కృతకత్వం సమస్య. రచయిత ప్రజల ఆత్మవిశ్వాసాన్ని, చైతన్యాన్ని అర్థం చేసుకుంటే యీ సమస్య రాదు. జీవితంలో వున్నదే, ప్రజల చైతన్యం ఏ మేరకు అభివృద్ధి చెందివుందో ఆ మేరకే చెప్పొచ్చు. అట్లాంటి కథలే వర్తమానం పునాది మీద లేస్తున్న భవిష్యత్ భవనాన్ని రూపుకట్టగలుగుతాయి. ప్రస్తుత దుర్మార్గంమీద వ్యతిరేకతతోపాటు, దీన్ని ఎదిరించి, పోరాడి గెలువగలమనే ఆత్మవిశ్వాసాన్ని యిస్తాయి.

ఆఖర్న ఒక మాట చెప్పాలి. ఈ వ్యాసం శాస్త్రిగారి మొత్తం కథలమీద వ్యాఖ్యానం కాదు. కేవలం 8 ముక్కల మీదనే ఎలాంటి కథలు యివ్వాల్టి ఆవశ్యకతో అట్లాంటి కథలు ఆయన రాసివుండవచ్చు. అందువల్ల ఆయన మొత్తం రచనలపై ఒక సమగ్ర పరిశీలన తప్పనిసరిగా అవసరం తెలుగు పాఠకులమీద ఒక చెరగని ముద్ర వేస్తూ పోతున్న గొప్ప కథకుడి గురించి సమగ్ర అవగాహనకు రావడం ఎంతైనా అవసరం.



# తెలుగుకథ - రావిశాస్త్రి

— వెంపలి

పురాణం అంతటివాడే శాస్త్రిగారి గురించి ఏంరాస్తే ఏంమునుగుతుందో నని, సూక్ష్మంలో మోక్షంలాగు ఒకపేజీరాసి ఊరుకున్నారు జ్యోతిలో—

అసలే - కవిత్వంతోతప్ప, కథతో అంత పరిచయంలేని నేను, కథల గురించి అందునా రావిశాస్త్రిగారి కథలగురించి చెప్పబోవటం పెద్దదోషం- ఇదిగో నా అజ్ఞానాన్ని మీ ముందు ఇలా ప్రకటిస్తున్నాను —

కథ ఉత్తమవచనంలోనూ చెప్పొచ్చు- శుద్ధ కవిత్వంలోనూ చెప్పొచ్చు- కవిత్వంలో ఈ కథాకావ్యరచనకు బహుళప్రచారం కల్పించినవాడు కుందుర్తి ఆంజనేయులు- ఐతే, చెలం, రావిశాస్త్రి లాంటికొందరు రచయితల రచనలలో వచనమూ, కవిత్వమూ సహజీవనం చేయటంకూడా మనంచూస్తున్నాం—

'A short story is a story that can be easily read at a single sitting' అని ఒకపాశ్చాత్యరచయిత స్థూలనిర్వచనం—

ఆచంటసాంఖ్యాయనశర్మ, గురజాడ అప్పారావులతో మొదలైన తెలుగు కథ చెలం కలం బలంతో చేవదేరింది—

తెలుగుకథ ఎదుగుదలకోసం మల్లాది,శ్రీపాదలు వంతులవారీగా డ్యూటీలు చేసారు —

మహామేధావి కామ్రేడ్ కుటుంబరావు రంగప్రవేశంతో, జనం ప్రయోజనం లక్ష్యంగా తెలుగుకథ హోరెత్తింది —

రావిశాస్త్రి ఆదిగా కాళీపట్నం రామారావు, బీనాదేవి, రంగనాయకమ్మ, డి. వెంకట్రామయ్య, పెద్దిభొట్ల సుబ్బరామయ్య,స్మైల్,జంపనపెద్దిరాజు, శ్రీరంగం రాజేశ్వరరావు, ఎన్నెస్ప్రకాశరావు, అల్లంరాజయ్య మొదలైన వారు తెలుగు కథని ఎరుపెక్కించారు.

కొన్ని కలాలు జనాని కంకితమౌతాయి- కొన్నికలాలు ధనంధ్యేయంగా పెద్దదారులలో, దొడ్డిదారులలో నడక సాగిస్తాయి—

శాస్త్రిగారు సారాకథలు రాసినా, సారోకథలు రాసినా, బాకీ కథలురాసినా బంగారం కథలు రాసినా ఖచ్చితంగా వాటిల్లో జనం గొడవ షంటుంది.

వచనరచనలో రావిశాస్త్రిది ఒక ప్రత్యేకబాణీ- కేవలం ఒక్క విషయంలో మాత్రం శాస్త్రిగారి కథల్ని నేను వెంకటచలం కథల్తో పోలుస్తాను- ఆ ఒక్క విషయమూ ఏమిటంటే, 'కవిత్వం' — ఇరువురికథలలో, ప్రవహించే రక్తంలో కవిత్వం నయాగరాలా దూకుతుంటుంది —

కామ్రేడ్ కె వి. రమణారెడ్డి గారన్నట్లు — రావిశాస్త్రిగారి కథలు చదివిన వెంటనే పాఠకుల్ని ఆకట్టుకుంటాయి. ఉత్తేజపరుస్తాయి –

పోలిక అనవసరమే ఐనా. ఒక ఉదాహరణ- వెనకటికి ఒకడు షేక్స్పియర్ నాటకం ఒకటిచూసి, "ఓస్ ఇంతేనా ఇందులోని పాత్రలన్నీ నాకు తెలిసినవే- నేను రోజూ చూస్తున్న వే"అన్నాడట. అదేషేక్స్పియర్ గొప్పతనమని పాపం వాడికి తెలియలేదు-

మన శాస్త్రిగారి కథలలోకూడా మనం రోజూచూసే ముత్యాలమ్మలూ, మనం రోజూచూసే అప్పారావులే దర్శనమిస్తారు –

'తప్పులు అందరూ చేస్తారు. త్యాగాలు మాత్రం కొందరే చేస్తారు' అని శాస్త్రిగారే అన్నట్లు కథలు చాలామంది రాస్తారు కాని, మంచికథలు మాత్రం రావిశాస్త్రిలాంటి ఏకొద్దిమందో రాస్తారు—

కష్టం రావిశాస్త్రిది — లాభం తెలుగు పాఠకులది — కష్టం అంటే శాస్త్రిగారు కథల్రాసే కష్టం- లాభం అంటే పాఠకులకి కలిగే చైతన్యం అన్నమాట—

బహుశా శాస్త్రిగారు ఒక ఆలోచనని అనేక కథలుగా రాసారని నేను అనుకుంటున్నాను— ఆ ఆలోచన పేరు 'జనం' అనికూడా అనుకుంటున్నాను-

విప్లవ కవిత్వం వస్తున్నంత విరివిగా విప్లవకథ రావటంలేదని ఒక విమర్శ. అదివాస్తవంకూడా —

వర్తమాన కథా రచయితలు భవిష్యత్తులో కుటుంబరావు, రావిశాస్త్రి, కాళీపట్నంరామారావుల దారిలోపయనిస్తారనీ, విప్లవకథ మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతుందని ఆశిద్దాం

రావిశాస్త్రి జిందాబాద్ ! విప్లవరచయితల సంఘం వర్ధిల్లాలి !! విప్లవం వర్ధిల్లాలి !

గ్రంథ సమీక్ష :

# రా. వి. శాస్త్రి అంతరంగం

— కె. వి. ఆర్.

[రావి శాస్త్రీయం — రచన : రాచకొండ విశ్వనాథశాస్త్రి. కూర్పు : చలసాని ప్రసాద్. విరసం ప్రచురణ. ధర : రు. 12-00. ప్రతులకు : సృజన, వరంగల్ - 506001. సి. యస్. ఆర్. ప్రసాద్, సి - 108, శ్రీనివాసనగర్ కాలనీ, గుంటూరు - 522006 ]

“మంచి” అంటే రా. వి. శాస్త్రికి మాచెడ్డ ఇష్టం. గురజాడ తర్వాత ఇంత తరచుగా ఆ మాటను మరోరచయిత ఎవరూ వాడలేదు. కేవలం వ్యక్తి సౌజన్యాన్ని సూచించేందుకైతే, “మహాత్మ” గాంధీ హృదయ సంస్కరణవాదంతో సరిపెట్టుకుని వుందురు. తన ఊహా సమాజాన్ని శాసించే ధర్మంగాకూడా ఈమాటను వాడలేదు. అలా చేసివుంటే అందమైన కలలతో మైమరచివుందురు. సమాజం విచ్చెనమెట్లలో పైవాటిమీద దర్పంగా కిందివారి తలలమీద తమ కాళ్ళను దుర్మార్గంగా అదిమిపెట్టి కూర్చున్న “పెద్దలు” వద్ద ఈ దినుసు దొరకదుగాక దొరకదు. సమాజాన్ని అడవితో పోలిస్తే, ఈ పెద్దలు “పెద్దపులులు” గానో “తోడేళ్ళు” గానో కనిపిస్తారు. అధికార బలోపేతులైన వీరి ఆగడాలకు బలైపోయే “దీనులు, హీనులు పతితులు, భ్రష్టులు, బానిసలు, పీడితులు” — “అలగాజనం” — “జనం” మాత్రం అమాయకంగా అరక్షితంగా గోవులుగానో, మేకలుగానో కనిపిస్తారు. వీరిమేలే మంచి రా. వి శాస్త్రి ఈమాటంటే చెవి కోసుకుంటారు. రచయితగా ఆయన అంతరంగంలో సాధు జీవాలవంటి ఈ జనసామాన్యానికే జాగావుంది.

అవతార పురుషుడో దీన జనోద్ధారకుడో ఒకరువచ్చి ఈ జనానికి ఛత్రం అడ్డు వేయవలసిన అక్కర్లేదని రా. వి. శాస్త్రికి తెలుసు గోవర్ధనగిరినెత్తి గోవుల గోపకుల గాచిన గోపాలకృష్ణుడంటే తన కిష్టమని రాసినా, ఆయన వెర్రిబాగులవాడేమీ కాదు. “పులిపళ్లు గల పెద్దలు పులులుగా “మారి గోరడం ఎంత వాస్తవమో. గోవులూ, మేకలూ తల దెగిసుకుని కొమ్ములూ కాళ్ళూ విసిరి ఆత్మరక్షణ

చేసుకోవడమూ అంతే వాస్తవం ఎవరో బైటినుంచి వచ్చి వీటికి నాయకత్వం వహించే అగత్యం లేదు, తమలోంచే తమ నాయకులు పుట్టుకొస్తా రంటారు రా వి శాస్త్రి. అలా తప్పక జరుగుతుందని ఎవరూ చెప్పలేరు. పుట్టుకనుబట్టి ప్రజా సామాన్యానికి చెందకపోయినా, సర్వసంపూర్తిగా పురిటి వాసనలు వదిలించుకుని పీడితులతో మమేకమైన లెనిన్, మావోలను, తానే ప్రస్తావించారు. వీళ్ళయినా ప్రజలకు చైతన్యం కలిగించాలి. అంటే, అది తనంతట తానై వచ్చేదికాదు కష్టనష్టాలున్నంతమాత్రాన్నే వాటిని తుద ముట్టించితీరాలన్న నిర్ణయం చేసుకునేట్టుగా రూపొందవచ్చు. రూపొందక, అణిగి మణిగి పడివుండే సహనంగా రూపొందవచ్చు. తమ దుస్థితికి మూలకారణాలను సాకల్యంగా తెలుసుకుని స్పృహను చైతన్యంగా పెంచుకున్నాక, "వాళ్ళ జ్ఞానమే వాళ్ళ బలమే వాళ్ళకి దిక్కు, వాళ్ళకి రక్ష." ఇది మొదలయ్యాక, వాళ్ళు మరేమాత్రం వట్టి జనంగానే వుండరు — మహా ప్రజగా మారి చరిత్రను మార్చగలుగుతారు.

"సామాన్యుల్ని సామాన్యులే కాపాడుకోవాలి. కర్షక కార్మికుల్ని వారే సంరక్షించుకోవాలి. పీడితుల బాధలు వారి స్వయంకృషితో వారే తెంచుకోవాలి" అనడం బాగానేవుంది పీడిత జనం విముక్తి మరొకరి కృషివల్ల జరగదు. తమ చైతన్యం ఉద్యమంగా సంఘటితరూపం పొంది పోరాటంగా పరివర్తనం చెందాక విప్లవం ఫలితంగా విముక్తి జరుగుతుంది. ఈ క్రమాన్నంతా చూస్తూ శత్రువు చేతులు ముడుచుకు కూర్చోడు. వాడిరాజ్యం రాక్షసిగా విజృంభిస్తుంది. వాడి చట్టాలు యమపాశాలౌతాయి కాబట్టి వీటిని ఎప్పుడు ఎలా దెబ్బతీయాలో, అంతిమంగా వాడి నెలా మన్ను గరిపించాలో, ప్రజలే తెలుసుకుంటారని, రా. వి. శాస్త్రి అభిప్రాయం. ప్రజలకు మొగదార్లుగా సిద్ధాంతబలంతో పథకం ప్రకారం ఈ పోరాట క్రమాన్ని రూపొందించి నిర్వహించే విప్లవపక్షానికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. తనకు యీమాత్రం తెలీదని కాదుగాని, పేదవాళ్ళ ప్రతినిధిగా పార్లమెంటుకు వెళ్ళి "సేవ" చెయ్యదలచిన పులిబంటి పెదకోటిపల్లి "వినతిపత్రం" సందర్భంలో మాత్రం, రా వి. శాస్త్రిలాంటి విజ్ఞులు సైతం పప్పులో కాలువెయ్యడం విచారకరం. విప్లవ పోరాట చైతన్యాన్ని ఇది పక్కకు తిప్పుతుంది. పెదకోటిపల్లి గెలిచివుండినా, మౌలికపరిస్థితి మారివుండేదికాదు.

సమాజంలో ఒకపక్షం మంచి మరోపక్షానికి చెడ్డగాక తప్పని పరిస్థితిలో, రచయిత అన్నవాడు ఏపక్షం మంచిని కోరుకోవాలో రా. వి. శాస్త్రి అనేక సందర్భా

లో స్పష్టం చేసివున్నారు. తా నెవరిమంచిని కోరుకుంటున్నారనేది, మంచి రచయితకు గీటురాయి. తనకు "ఆవేదన' కలగాలి. 'మంచి' పక్షాన నిలబడగల ధైర్యం ఉండాలి, కనీసం అలాంటి బలమైన కోరికైనా కలగాలి రా వి శాస్త్రికి యీ అవగాహన క్రమ పరిణామ ఫలితంగా ఏర్పడింది. ప్రవృత్తినిబట్టో వృత్తినిబట్టో ఏర్పడేట్టయితే మరెందరో రా వి. శాస్త్రులు రూపొంది వుండేవాళ్ళు. జీవితాన్ని లోతుగా చూసి దాని సారాన్ని గుండెకూ, మెదడుకూ పట్టించుకోవడం అందరికీ సాధ్యమయే పనికాదు కొందరికి ఇష్టమూ ఉండదు రా. వి. శాస్త్రి తన మాటల ప్రకారమే మొదట 'ఫ్యూడల్ మనిషిగా' మొదలయ్యారు. చిన్నతనంలో కాంగ్రెసు ఉద్యమాల సభ మావించారు. నెహ్రూ "సమ్మోహనాస్త్ర" శక్తి యిటీవలదాక గూడా తనను వదల్లేదు. భగత్సింగు, అల్లూరి సీతారామరాజు, సుభాస్‌బోసు వగైరాల ప్రభావమూ ఉంది. పసితనంలోనే రచనకు దిగి. రసపుత్రుల కథల మొదలు "అయ్యో అయ్యో" 'ఛీఛీ' కథల మీదుగా, చివరికి జనం కథలదాకా సాగివచ్చారు. ఎటొచ్చీ జనం ప్రభంజనమయ్యే ఆయన కలంనుంచి వెలువడ వలసి ఉంది చెహావ్ మంచి ఈ జనంపట్ల సానుభూతిలో కూడిన వైఖరిని రాబట్టుకున్నారు. డికెన్సు మంచి మంచి చెడ్డల సంఘర్షణలో మంచిని అభిమానించడం నేర్చుకున్నారు వోడ్‌హౌస్ నేర్పిందాన్ని కావాలని మరిచిపోయారు వ్యక్తిగానూ రచయితగానూ తాను లోకం నించీ పుస్తకాలనించీ తీసిన సారాన్ని "మంచి" అని పిలుస్తున్నారు.

ఇది ఆకాశకుసుమం కాదు. అందుచేతనే ఆయన రచనలు కేవలం చచ్చు "క్లినికల్ రిపోర్టులు' కావు, ఆవేదన నిండిన గుండెనుంచి గాఢమైన భావోద్రేకాలు పొంగి పొర్లేట్టుగా. జీవితం చీకటి కోణాలను వెనుక వెలుగులోని సప్తవర్ణ చిత్రాలుగా చూపగలిగారు. అట్టడుగున పడి బతుకుదెరువుకోసం చెయ్యగూడని పనులైనా సరే చేస్తూ, అందు వల్లంగా "నేరస్థులు" అనిపించుకుంటున్న వారే తన రచనలలో ఎక్కువగా కనిపించడానికి కారణం, ఆయన సూక్ష్మపరిశీలనకు అవకాశమిచ్చిన జీవితఖండం అలాంటిది కావడమే కార్మికులైనా. శ్రమజీవులైనా ఈవ్యవస్థ స్వచ్ఛ పదార్థాలుగా ఉండరు ఈ సమాజానికి మూలమే నేరం, అక్రమం. ఎవ్వణ్ని మంచిగా సజావుగా వుండనివ్వని సామాజిక ధర్మాన్నే పూర్తిగా మార్చనంత కాలం వ్యక్తి స్వభావాన్ని వంకర దిద్దటం అసంభవం. స్వలాభ పరాయణమైన ఆర్థికశక్తులు జీవితాన్ని శాసిస్తూ. స్వభావాన్ని వక్రంచేస్తున్నాయి. ఈ ఆర్థికశక్తుల ప్రత్యక్ష రూపమైన రాజకీయం పరోక్ష రూపాలైన కళలూ, తత్వాలూ, చట్టాలూ వగైరా కలిగిస్తున్న దుష్పరిణామాన్ని అరికట్టకపోతే, "మంచి" అంతరిస్తుంది. ఈ అవగాహన

సాధించుకునే క్రమంలో రా. వి. శాస్త్రికి దేవుడుమీద నమ్మకం దాదాపు పూర్తిగా పోయింది. 'పెద్దల'మీద గురి తప్పింది "పాంకుల బందూకుల" పెత్తనాన్ని ప్రజలు కూలదోయడమే సబబనిపించింది. "అన్యాయం, అధర్మం మోసం కధకుడికి వుండే కసి" పెరిగింది. అయితే, మధ్యతరగతి మనుషులవల్ల మాత్రమే యీ బ్రహ్మచెముడు దొంకదుంప నాశనం కాదనీ, శిష్టులమనుకునే వారికంటే ప్రజలే విశిష్టులు గనక వాళ్ళ వల్లనే యీ మంచిపని జరగాలనీ తెలిసింది

"పేదలంతా ఏకమైతే పెద్దలందర్నీ ఒకపెట్టు పెట్టేయవచ్చని నేను నా ఆశల అజ్ఞానపు రోజులలో అనుకొంటూ ఉండేవాణ్ని కాని, పెద్దలంతా కొండల్లా బలిసిపోయేరంటే వాళ్ళ వేళ్ళు నేను అనుకున్న కంటే లోతులోతులలోకి చొచ్చుకుపోవడమే కాకుండా దూరదూరాలలోకి విస్తరించుకొని ఉన్నాయని నేను తెలుసుకున్నాను. పెద్దల్ని కూకటివేళ్ళతో సహా పెకలించకపోతే ప్రయోజనంలేదు మాను కొట్టేస్తే అది వేళ్ళలోంచి మళ్ళీ తన్నుకుపుడుతుంది."

విషవృక్షాన్ని నిర్మూలించే కార్యక్రమంలో రా. వి శాస్త్రి జనం పక్షాన ఉన్నారు గనకనే, వి.ర.సం తో ఇప్పుడు సంస్థాగతమైన సంబంధం లేకున్నా, ఆయన వచన రచనలను వి.ర.సం. తన ప్రచురణగా తెచ్చింది. ఆయన జనం 'మంచి'ని కోరే గొప్ప రచయిత బంగారమంటే శ్రమశక్తే నని తెలుసుకున్నవాడు మార్క్సిస్టయితే తనకే మరీ మంచిది. ప్రతి ఒక్క రచయితా అలా కావాలనే, అంటే 'మంచి' రచయిత కావాలని వి ర. సం. కోరిక ఇది నిబంధన కాదు, కాలేదు కూడా. సీతాకోక చిలకలు ఎలాగూ వడ్రంగి పిట్టలు కాలేవు

రా. వి. శాస్త్రి చమత్కారంలో కారం వుంది. "రుద్రుడి రౌద్రం" వుంది జీవితంలో క్రూరమైన, బాధలతో నిండిన నిజాన్ని రచనలలో చూపెట్టేందుకు ఆయన ఎంపిక జేసుకున్న రచనా పద్ధతి ఆయన సొంతం. వస్తువుని మించివేపేంత అతిశయించకుంటే మంచిది. అయితే ఆనిజం పట్ల ఆయనకున్న నిబద్ధత విషయంలో నిజాయితీ విషయంలో, సందేహానికి ఏ మాత్రం ఆస్కారంలేదు జనంలాగానే రా వి. శాస్త్రి అమాయకుడేమీ గాదు అప్పుడప్పుడు ఆయన చేసిన చిన్న చిన్న వచన రచనలు, కొద్దిపాటి ప్రసంగాలు. విలువలో మాత్రం పెద్దవీ, గొప్పవీ. ఆయన అంతరంగం మానవమహా ప్రపంచం తాలూకు సంకులమైన జీవితం ఈ పుస్తకం రాచ"కొండ"కు అద్దం. 'కొండ అద్దమందు కొంచెమై ఉండదా?' అన్నట్టు ఈ పుస్తకంలో ఆయన ప్రతిబింబమూ కొంచెగానే ఉంది.

93

జైళ్ళకు సంకెళ్ళకైన జేగురు జేగంట వివిచి,
శత్రుతంత్ర శిరస్సుపై తిరుగుబాటు చరణముంచి,
ఆశయాలు చోటుగా ఆచరణే చేతనగా,
దోపిడిపై ముట్టడించి ప్రస్థానం దాటినోడ !
తమ్ముల, అన్నల పిడికిట పునర్జన్మ దాల్చినోడ ! ॥ఎర్ర॥

కష్టాల్లో, నష్టాల్లో గండిపడని చిరునవ్వై,
బరువుల్లో, బాధ్యతల్లో పొగచూరవి చేదివై,
యువకుల్లో యువతగా, పెద్దల్లో పెద్దగా,
'వారుమజుందారి'లోవ సాగివ ఓ కామ్రేడా !
చెమటజీవి చరితపుటల చెరిగిపోవి చెలికాడా !
మవు తీర్చిన ప్రజాయుద్ధ విగ్గు సంస్కృతీ పతాక
జన విముక్తి శిబిరాలకు జనంకోటి ఎగరేస్తాం ॥ఎర్ర॥

---

# "ఆధునిక చేతన"

సాహిత్య సాంస్కృతిక వేదిక, తిరుపతి.

మొదటిసారిగా బులెటిన్ ప్రచురణ చేపట్టనున్నది కవితలు, కథలు, వ్యాసాలు, చిన్న నాటికలు ప్రచురణకోసం ఆహ్వానిస్తున్నాం. రచనలు ప్రజా పోరాటాల్ని, ఆధువిక చైతన్యాన్ని ప్రతిబింబించేవిగా వుండాలి అని వేరే చెప్పనక్కర్లేదను కుంటాం.

మీ అందరి సహకారంతో త్వరలోనే వెలువడే ప్రారంభ సంచికకు రచనలు నవంబర్ 15వ తేదీ లోగా పంపగలరు. పారితోషికం వుండదని మనవి.

అడ్రసు :


పి. సి నరసింహారెడ్డి, లెక్చరర్ (లింగ్విస్టిక్స్)
తెలుగు అధ్యయనశాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి - 517 502


---

32-34 [illegible]NA TARA H/GTR-70
AUGUST - OCTOBER 1982
Annual Subscription Rs. 20-00 Price Rs. 3-00

# ఎర్రదండాలు

—రుద్రజ్వాల

ఎర్రదండాలు – నీకు ఎర్రెర్రదండాలూ చెరా !
ప్రజలపాట పల్లవీ ! పోరు బాట ప్రజాకవీ ! ||ఎర్ర||

దిక్కులనే మీటి మీటి, ధిక్కారం దూసి దూసి,
దిక్కులేని దీనజనం దిక్కువై నిలిచి, నడచి
బోల్షివిక్ పవనంగా, నగ్జల్బరి కొలిమిగా,
విరసం తొలి సంజనుండి విప్లవాగ్ని చెరగినోడ !
వర్గయుద్ధ సంస్కృతిపై విద్యుత్తును పంచినోడ ! ||ఎర్ర||

పల్లెకలల గమ్యానికి పదం, పదం పాదుజేసి
జనం కళల చాళ్ళవెంట చిటికెలు, చిందులు వేసీ
పాణిగ్రాహి నీడగా, పరిటాలా జాడగా,
భూమిసంతు పాదెకట్ల బంధనాలు బుగ్గిచేయ
బువ్వెట్టిన మట్టితల్లి పిల్లంబై బతికినోడ ! ||ఎర్ర||

తలచీకటి చీల్చుతున్న తలపుకాంతివైపు నిలిపి,
కుడి కన్నూ క్రుంగినా కుదికి జారకుండ ఎగసి,
మార్క్సిజమే శ్వాసగా, మావోమాట చూపుగా,
ప్రతినెత్తురు బొట్టుబొట్టు ప్రజకోరకే పిత్తినోడ !
ప్రభువర్గం పునాదులకు భూకంపం ఎత్తినోడ ||ఎర్ర||

—కొరవ 8 వ కవర్ లో

Edited, Printed & Published by T. MADHUSUDANARAO
Printed at Venkataramana Printers, Guntur-1
REVOLUTIONARY WRITERS' ASSOCIATION



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M103 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Ishanyasree |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |